# కంఠాభరణము.

గ్రంథకర్త:

పానుగంటి లక్ష్మీనరసింహారావు.

ప్రకటనకర్త:

కందుల గోవిందము,

జనరల్ బుక్ డిపో,

బెజవాడ, కృష్ణా జిల్లా.



కాకినాడ:

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలలో

సుబ్బారాయుసోదరులచే ముద్రింపబడియె.

కాపీరైట్] 1926. [వెల 1-0-0.

# ప్రహ్లాద

[గ్రంథకర్త:—సోమరాజు రామానుజరావుగారు]

ఈగ్రంథమును రచించినకవిగారు "స్వారాజ్యరథ" మని బహునాటకములను రచించి కీర్తిగన్నవారు. వీరికవిత్వము ద్రాక్షాపాకము. అందుముఖ్యముగ నీనాటకమత్యంతాద్భుతముగ వ్రాయఁబడినది. భాగవతమునందలి "మందారమకరంద" అనుపద్యముతో సమానముగనుండు ననేకపద్యము లీపుస్తకమునందున్నవి. సంగీతప్రహ్లాద యనుటచేత నీయందు రమ్యములగు ననేకపాటలుగలవని యూహింపదగును. సనకసనందనాదులవలన విష్ణుద్వారపాలకులగు జయవిజయులకు శాపముగలుగుటయు, వారు హిరణ్యకశ్యప హిరణ్యాక్షదానవులై జననమగుటయు శ్రీవిష్ణుండు యజ్ఞవరాహరూపమున హిరణ్యాక్షుని దునుమాడుటయు తద్విచారమున హిరణ్యకశ్యపుడు విష్ణుని సాధింప తపంబుసేయుటయు, బ్రహ్మవరంబులిచ్చుట, యాలోన నింద్రుడు లీలావతిం జెరబట్టుట, నారదుడువిడిపించి తన యాశ్రమంబునకుగొని చని విష్ణుబోధచేయ గర్భస్థుడగు ప్రహ్లాదుడువినుట, ప్రహ్లాదుని బాల్యము, అతనిభక్తికి హిరణ్యకశ్యపు డాగ్రహించి వాని విష్ణుభక్తిమానుటకు చండామర్కులకడ చదివించుట, "ఎంతచెప్పిన విష్ణుభక్తిమానని ప్రహ్లాదుని హిరణ్యకశ్యపుడు కొండలద్రోయించి, సాగరమునముంచి, యగ్నులబడవేసి, పాములగరపించి విషమిప్పించి, యనేకబాధలం బెట్టులు" విష్ణువు ప్రహ్లాదు ననేకవిధముల రక్షించుట, విష్ణుభక్తిమహాత్మ్యము చదివితీరవలెను. విష్ణువెందుంగానక విసిగి వేసరి హిరణ్యకశ్యపుడు తుదకుకుమారుని విష్ణుడెందున్నవాడని వానిని నడుగుట, ప్రహ్లాదుడు, ఇందుగలడందు లేడని సందేహమువలదు; చక్రి సర్వోపగతుం డనియుత్తరమీయ హిరణ్యకశ్యపుడు హరియిందుగలడాయని సభాస్తంభముంగొట్ట శ్రీహరి నృసింహావతారధారియై స్తంభమునుండి వెడలివచ్చి హేమకశ్యపుని వక్షముఁజీల్చి సంహరించుట, (మహాభయంకరరంగము) గ్రంథమంతయు భాద్రిభక్తిరసముల చక్కనిమేళనమైయున్నది. కొలదిప్రతులుగలవు. త్వరపడవలెను.

వెల. 0—12—0

వలయువారు—

కందుల గోవిందం,

జనరల్ బుక్కుడిపో బెజవాడ.

గూడుచుండి యథావిధిగ—పురోహితుడు పెళ్లియంత వరకు లేకుండ జరిపింపవలసినది. అంతేమనకని—దాని కాధ్యానములో బని లేదు ?

వేంక—అనాచారమని కాఁబోలు మీయభిప్రాయము ?

బంగా—కాదేమిటి. జాము రాత్రివేళ ఏడ్పును తద్దినాలవరి కేంప యొంకులకు ? మిక్కిలి బాగుగానున్నదట ! ఓ ! ఇదుగో ఓ ! మీ మఱందలు సుబ్బలక్ష్మి చూడవలయునని యనుచున్నది తల చెడిన దిమొదలు గుమ్మముదాటి యెఱుఁగదు. వేడుక పడుచున్నది.

సోమా—తలయింకను చెడకుండ నున్నదానవు నీవుమాత్రము ! గుమ్మముదాటి యెఱుఁగుదువా ? మనయింటిలో ముట్టునకు మహాలక్ష్మిసమానలకు, గంగాభాగీరథీ సమానలకు భేదమన్నమాట నా చెవిని బడఁగూడదు ఆ ! సంఘటములో భాగ్యము మున్నంతవఱకా నిమ్మమాత్రము నిల్పుకొనఁగలను. అటుపైని బ్రహ్మశ్రీలుగంగాభాగీరథీసమానలైనసరే; గంగాభాగీరథీసమానలు సౌభాగ్యవతులైనను సరే.

సుబ్బ—అక్కా. నామీఁదఁ బెట్టవద్దమ్మా ! నేనేచూడవలయునని దేవులాడుచుండ లేదమ్మా ! వేడుక నాకుమాత్రమేమి నీకు మాత్రము లేదా యేమి ?

బంగా—ఒక్క నీకూనా కే కాదమ్మా ! ఊరనున్న యమ్మలక్కలకందఱకును వేడుకగానే యున్నది. ఉండదా అమ్మా ! నాటి యాఁడుదివచ్చి యేవోమగవారు చేయలేని పిలితనులు చేయుచుండు నప్పుడు—ఈరోజునవాము గ్రామమునఁ బంచిపెట్టించిన కాగితమెంత పెద్దదిగానున్నదో వేంకటశాస్త్రి ! నీవుచూడలేదా ?

వేంక—ఇదిగో ! ఎంత పెద్ద కాగితమో !

సోమా—నాగావంచా యింతకంటెఁ బెద్దది.

వేంక—అట్లు కాదు. ఈ కాగితములో నెన్నో వరమాన్యతపు సంగతులున్నవి.

సోమా — నాగావంచాలో నన్నోబమ్మకమ్మకట్లున్నవి. అదే మిమాట! కాగితంపుగొప్ప మరెవరియొద్దనైనఁ జెప్పుముగాని నా యొద్దమాత్రము చెప్పకేమి! ఈదిక్కుమాలిన కాగితాలతో గ్రంథాలు చేయుటచేతనే సదాచారమునకుఁ జనువునకు దూరమని యక్షర శ్రీకారమునే పరిత్యజించినాను.

వేంక — అక్షరస్వీకారమయ్యా!

సోమా — కావచ్చును! ఏదియైనను నెవరికిఁగావలయును. మన కెంతసేపును గావలసినది వైదికకర్మము — అగ్నికార్యము మఱి — ప్రాతస్స్నానము — ప్రాయశ్చిత్తము.

వేంక — ప్రాతస్నానము, ప్రాయశ్చిత్తమని మీయభిప్రాయము కాఁబోలును?

సోమా — వేంకటశాస్త్రి! నీవు పండితుఁడవు. నీదారి వేఱు, మాదారి వేఱు-నీకు మాకు నేతము పెట్టు. మా రాజగారొక దినమున నాస్థానపుఁబండితులందఱు సేలువులు తలకుఁ జుట్టుకొని సభలోనికి రావలసినదని సెలవిచ్చిరి. నేను బండితుఁడనుగాను. శుద్ధకర్మయోగిని గదా! సామాన్యపుఁ బండితులతో కాఁబట్టి నేనును తలకు సేలువు చుట్టుకొనవలసినది! ఏమని తలకు సేలువు చుట్టుకొనవలసినదని పట్టుదలతో నాస్థానపుఁబండితుల నడుగఁగా వారిలోఁ దార్కికుఁడైన తిరువేంకటాచార్యులుగారు అవధానులుగారూ! ఏమని చుట్టుకొనవలసినదని యింత మీమాంసతోఁ బనిలేదు. సీతారామాభ్యాన్నమః యని చుట్టుకోవలసినదని భక్తిగౌరవములతోఁ జెప్పినారు. తప్పుమాట కాదుగదా యని యూకద్ధావతినే చుట్టుకొంటిని.

వేంక — పద్ధతియను సెలవీయఁదగును.

బంగా — ఓ. ఇదిగో! ఓ ఇటుచూడుఁడు.

సోమా—ఓసీ! ఇంటిదానా! ఇఁక నాటకములోనికి వెళ్ళఁగమని చెప్పకు.

బంగా—అది నాటకము కాదు. దానిలో వేషములేవియు రావు. వేంకటశాస్త్రీ! దాని పేరేది?

వేంక—దాని పేరు సర్కసు.

సోమా—శాస్త్రీ! సర్కసుశబ్ద మే భాషయని మీయభిప్రాయము?

వేంక—నాకు బాగుగాఁ దెలియదు.

సోమా—శబ్దసంబంధమైన రహస్యమొకటి చెప్పెద వినుము. కఠినశబ్దమేదైననుసరే సంస్కృతమని నిశ్చయింపవలసినది. ఒక్కటే సూత్రము. దీనికిఁ దిరుగుసూత్రము లేదు.

వేంక—ఆలాగా? అట్టిశబ్దమున కర్థము మాట?

సోమా—అర్థ మెప్పుడు ద్వితీయపక్షము. సృష్టికాలమందు బయలుదేరినది శబ్దబ్రహ్మముగాని యర్థబ్రహ్మము కాదు. శబ్దమన్నప్పుడు వేదము. వేదమున కర్థము లేనేలేదు, అందుచేతనే సర్వజాతులందు దానికి ఘనత.

బంగా—ఇదిగో! ఓ! మీ రేవో మాటలు పెట్టుకొని కూరుచుండినారు. మాకు వేళయగుచున్నది. మనపొరుగువాఁడువారు మగవారుఁగూడ వెళ్ళినారు. మేముఁగూడ—

సోమా—ఔనే! నీకు మతిలేదా యేమి? నీవక్కడకుఁబోయి చూచునదేమి?

బంగా—ఒక్కటియన్న మాటయేమి? ఎన్నోవింతలుఁట. వేంకటశాస్త్రీ! ఆ కాగితమొక్కసారి చదివి యాయనకు వినిపింపుము!

వేంక—(చదువుచు) అపూర్వమైన భూలోకవినోదము.

సోమా—కాగితము మీఁదిది చదువుటకు నేనంగీకరింపను.

నాఘటముండఁగా నట్టియకార్యభజనము. జరుగఁగూడదు.

వేంక.—ఆకార్యకరణమని సెలవిచ్చెదరు గాక.

బంగా—వేంకటశాస్త్రీ! పోనిమ్ము. ఇదిగో! ఓ! సర్కసులోనియామె తలవెండ్రుకలకు త్రాయిఁగట్టుకొని యెత్తునఁట.

సోమా—మామేనత్తకోడలు గొంతుసకుఁ బెద్దత్రాయిఁగట్టుకొని దిగినది—గోదావరిలో—విశేషమేమి?

సుబ్బ—బావగారూ! చాలులెండు, మీమాటలు మీరును—విశేషము లేదనుచున్నారేమి! లోకమంతయు నామెశక్తికి సంతోషించుచున్నది; మీకొక్కరికి వింతగాఁ దోఁచుటలేదు కాఁబోలు? ఆమెకుఁ బ్రజలు కనకవర్షముఁగురిపించుచున్నారు.

సోమ—సుబ్బలక్ష్మీ! నీశక్తి నీ వెఱుఁగకుండనున్నావు. ఆతిరకానులో నావిడ—

వేంక—తిరకాను కాదండి—సర్కసు

సోమా—సుబ్బలక్ష్మీ! ఆఱుకుంచాలు వారుగుండిగను గాడిప్రొయ్యిమీఁదినుండి యవలీల నెడమచేతితో నీవెన్నిసారులు సునాయాసముగా నిడ్వలేదు! ఆమెమీఁద నేదో ప్రజలు కనకవర్షముఁ గురిపించుచున్నారంటివే! నీమీఁద దేవతలు పుష్పవృష్టిఁగురిపింపవలసినది. నీకుఁదల వెండ్రుకలునిలిచినవి కావు. కాని వెండ్రుకకొక్కొక్క త్రాయి వ్రేలాడఁగట్టుకొని యొంటికాలిభరత మాడఁగలవు. వేంకటశాస్త్రీ! సుబ్బలక్ష్మినాకు మఱఁదలు, అనఁగ—మాయింటిదానికిఁ జెల్లెలు.

వేంక—మీరు మాయింటిలో బసచేసిన రెండురోజులనుండియు నామాత్రమే తెలియకుంటి ననుకొంటిరా?

సోమా—ఈమె చిన్నతనములోని భవిష్యద్వృత్తాంతము నీకెఱుఁగనిది కాదా?

వేంక—పూర్వవృత్తాంతమని కాఁబోలు మీయభిప్రాయము.

సోమా—పూర్వమానగమోపినను. దీనికిఁ బదవయేట వివాహమైనది. వెంటనే దీనిభర్త చదువుకొనుటకై నవద్వీపమునకుఁ బోయినాఁడు. వాఁడచ్చటఁ గర్మశాస్త్రము నేర్చుకొనరా యని యెంతఁ జెప్పినను వినక పారిపోయినాఁడు. కొన్ని సంవత్సరములు ఉత్తరములువ్రాసినాఁడు. తరువాత క్షేమసమాచారములేదు. అతఁడు బయలుదేఱిన తరువాతఁ బండ్రెండుసంవత్సరములు నిరీక్షించినాను. ఇఁక నిరీక్షించుటకు ధర్మశాస్త్రమంగీకరింపదని నిశ్చయపఱచుకొని మాభావమఱఁదులు వద్దు వద్దనుచుండఁగనే—వారు విశేషపరిపంచజ్ఞానము గలవారు కారు లెండు! కర్మప్రధానులుగారు లెండు—ఈకుఱ్ఱదాని నొకదినమున రేవునొద్దకుఁ దీసికొనిపోయి—శుద్ధముగా—పరిశుద్ధముగ—యథావిధిగ—దగ్గఱఁ గూరుచుండి రెండుచేతులు పట్టుకొని స్వయముగా రోమఖండనముఁ జేయించి చక్కఁగ నింటికిఁ దీసికొనివచ్చినాను.

వేంక—హరిహరీ! ఎంతపనిచేసినారు! అయ్యయ్యో! అదేమి?

సోమా—కర్మవిషయము వచ్చినప్పుడు నాయొద్దనుంట దయాదాక్షిణ్యములు లేవు. ఏకర్మమెప్పుడు జరుగవలయునో, యేలాగున జరుగవలయునో సూచాలుతప్పకుండఁగా—

వేంక—సూచాలయ్యా! కాని యామెభర్త బ్రతికియే యున్నాఁడేమో?

బంగా—ఇంకను బ్రతుకేమినాయనా. అన్నియుఁ దెల్లవాఱి పోయినవి. (అవధరించి) సుబ్బలక్ష్మీ! వేంకటశాస్త్రిగారి వంకఁ జూచుచున్నాఁడు. నాలాగే కొంచెము కన్నులొత్తుకో అమ్మా! బాగుగా నుండదు.

సోమా—బ్రహ్మదేవుఁడిచ్చిన యాయువుచే నతఁడు బ్రతికియున్నట్లే నిశ్చయపఱపుము. అయిననేమి. ధర్మశాస్త్రముమాత్రమతఁడు బ్రదికియున్నట్లంగీకరింపదు. అతనికిమాసాబ్దశ్రాద్ధాదులన్నియు జరుగ

వలసినవే. ఈ వేళనుండి గాక యిదివఱ కాఱు సంవత్సరములనుండి జరుగుచున్నవి.

వేంక — అబ్బ! కర్మమనఁగ మీ కెంత నియమము! ఎంతపట్టు! నేను మీవంటివానిని జూడలేదు.

సోమా — మఱొకఁడేఁడి! వేంకటశాస్త్రీ! ఇప్పటికి మావంశ మొక్కటిమాత్రమీ కర్మభూమి కంతకును మేటికిరీటములవలె నిలిచి యున్నది

వేంక — (తనలో) ఈ నిర్భాగ్యవంశము నశించుటయే లోకోపకారము

సోమా — నేను బాలుఁడుగా నుండుటచేత నావిశేషము మీకుఁ దెలియదు. కాని, మా నాఁడునాఁడు యావత్తు సన్నకరదేవతయని పిలుతురు. నేను గర్భవిషయమై చేసిన మఱియొక యేర్పాటు వినుము. మీ యూరనువారెవ్వరు లేక పోవుటచే మీ యిల్లంతయు మా స్వాధీనతలోనే యుంచినను — ఇటులంటినని నీవన్యథా యెంచవలదు — మాకు మాత్రము మిక్కిలి యిబ్బందికముగాను, సందుకాలు లేనట్లుగాను, నదేమో కన్నులకు నింపు లేనట్లుగాను నున్నది.

వేంక — ఎందుచేత?

సోమా — మాయింటి యేర్పాటు వేఱు. అది చక్కగా — శుద్ధముగా — శుచిగా — ఎక్కడికక్కడకుఁ దగినయుండునట్లుఁ జిన్నకుఁ జిన్న కాకుండఁ, బెద్దకుఁ బెద్దగాకుండఁ గట్టించినాను. దానిలో నగ్నిహోత్రిగృహము వేఱు — స్నానపుగది వేఱు — ప్రాయశ్చిత్తాది మీమాంసములు వచ్చినప్పుడు ధర్మశాస్త్రము చదువకుండ సిద్ధాంతపూర్వపక్షములు చేయుటకొక సావడి —

వేంక — మీమాంసలు — సిద్ధాంత పూర్వపక్షములని సెలవీయఁదగును.

సోమా—ఇంతేకాక—పదిమంది పిల్లలు గలవాఁడనుగదా! ఏవైనా కష్టములువచ్చుట మానవవికృతికాదా యని గ్రహించి—

వేంక—మానవప్రకృతియని ప్రవచింపవలయును.

సోమా—ఏమో, ఎటుఁబోయి యెటువచ్చునోయని రోగగృహ మొకటి యింటికిఁ గొంతదూరముగాఁగట్టించినాను.

వేంక—అయ్యయ్యో! పిల్లలకు రోగమురాఁగానే దానిలోఁ బడవైచుటకా?

సోమా—పిల్లలకేమి, పెద్దలకేమి! మాలోఁ జిన్నపెద్ద తాత్పర్యములు లేవు.

వేంక—చిన్న పెద్ద తారతమ్యములని సెలవిచ్చుచున్నారు కాబోలు.

సోమా—ఇదిగాక—ఇంటికినలుగురుకోడండ్రు, నలుగురాఁడుపడుచులున్నారా? వీరిలో నెవరికైనఁ దల చెడుటసిద్ధించునెడల నాకు రామర్యాంపుదినములలోఁ గలబాఁచుకొనుటకుఁగాను, ప్రచ్ఛన్నముగాఁ గూరుచుండి, చీకాకు లేకుండ, నావకాశముగా నోదార్పుమాటలు వినుటకుఁగాను, నేనమండ్రికు నెనిమిది చిన్నకొట్టులును నెవరిపేరుమీఁదు గావారికిఁ—దరువాతఁ దగవులేకుండఁ—గట్టించినాను.

వేంక—(గుండెలుకొట్టుకొనుచు)అయ్యో!అయ్యో!అదేమి!అదేమి ఇందఱుగృహస్థులను జూచితినిగాని యెవ్వరు నిట్టియేర్పాటులు చేసిరని వినియుండలేదే! ఎక్కడలేని వింతపద్ధతి మీకెందులకు? పోనిండు. ఏదో చేసినారు. అందఱికి నొక్కసారియే వైధవ్యమువచ్చునా? పోనీ. ఒకకొట్టు చాలదా?

సోమా—వేంకటశాస్త్రీ! అన్నియు నెఱిఁగియుండియు నటులనెదవేల? జంఘమరణములని నీవు వినియుండలేదా?

వేంక—సంఘమరణములా!

సోమా—అవును. కర్మము యథావిధిగ జరుపుటకేఁగదా దూరదృ
ష్టి యుంచవలయు ననుకొన్నావు? తీరా జామాత మరణము జేసికొనవలసి
వచ్చినప్పుడద్దె యుద్దేశముని కొందరనుకుండ గనులుసిద్ధముగా నుండినఁ
గర్మాచరణమున కెంతసౌలభ్యము! అట్టి యట్టి యందుపచ్చుకొన్న ట్టేక
ర్మమున కాకర్మమున కరణసామగ్రియంతయు సిద్ధముగా నున్నయెడల
మానస్సున కెంతనెమ్మది! మామిడితోరణము కట్టుకొనుట కెవ్వరైనఁ బిల్లి
చ్చెదరుగాని దర్భశయ్య కెవరైన నిచ్చెదరా? ఇల్లుగట్టుకొనుట కర్మ
మునకుఁగాని కాపురమునకుఁ గాదని నిశ్చయముగా నమ్మవలెను.

వేంక—ఇన్ని శ్రాద్ధపుగవులు లేవనియా మాయిల్లు మీకు
మిక్కిలి రోఁతగానున్నదని చెప్పినారు? మీరింత వారని నేనెఱుఁగను.
ఎఱిఁగియుండినయెడల మీకు నాయింట బసనిచ్చి యింత శ్రమను
గలిగించియుండను. అయ్యో! మీకుఁ బుట్టినవారందఱు క్షేమముగా
నున్నారా?

సోమా—లేరు—వచ్చిన దిక్కే మరి. సంతానసృష్టి యెంతయై
నున్నది. నలుగురు కొడుకులకు నొక్కకొడుకున్నాఁడు!

వేంక—కోడండ్రకుఁ గట్టించిన సమాధ్యంపు గనులలో గాల్పిం
టికి మూఁడుపూర్తియైనవా? ఒక్కటివారాత్రిమేనా యున్నదరువాయి?

సోమా—ఇప్పటివఱకంతే.

వేంక—అనఁగూడదు కాని యెంతపనిచేసితిరి. పిల్లవానికిరోగ
మారంభింపఁగానే వేఱుగా దూరముననున్నకొట్టులలో దర్భశయ్యపై
వానిని బడవైచినప్పుడు వాఁడుకెవ్వున గిలిచావఁడా? ముందెప్పుడో
ముండమోయు కోడండ్రకొఱకిప్పుడు మొగముచూచుకొట్టు కట్టించినతరు
వాతఁ గొడుకునిర్భాగ్యపుముండకొడుకులింక బ్రదుకుదురా? ఇంక ను
క్కుఁడైన నెందులకు మిగిలెనేయని యోజించుచున్నాను. అయ్యో! న
లుగురు కూఁతులు భర్తలతోఁ గాపురములు చేయుచున్నారా?

సోమా — ఏమి చెప్పుదును? వారందఱిల్లు పట్టినారు.

వేంక — అయినదా? వారినాలుగుగదులు వారికొప్పఁజెప్పినారా? అయ్యో! మఱియొక సంగతి యడుగుట మఱచితిని. మీభార్యకుఁ గూడ నొకకొట్టేల కట్టించ లేదా?

సోమా — మాయింటిదానికి మాంగళ్యవిచ్ఛిత్తి లేదని మాతండ్రిగారు సెలవిచ్చినారు?

వేంక — మాంగళ్యవిచ్ఛిత్తియని కాఁబోలు మీయభిప్రాయము?

సోమా — ఆ. అదినాచేతిమీఁదుగా వెళ్ళవలసినదే. అదృష్టవంతురాలు.

వేంక — అందుచేతనా యామెకుఁ బరామర్శపుగది లేకపోయినది?

సోమా — అది లేకపోయినప్పటికి, దానికిఁబ్రతినిధిగ మఱియొకకంపౌండులో వేఱొకచిన్నకొట్టు కట్టించియే యుంచినానుగాని యుపేక్షతో మాత్రము ఊరకుండలేను.

వేంక — ఆఁ. అదెందులకు?

సోమా — కర్త్రయొక్కరీతిగా రాదు. అందులో జందెము మార్చుకొను కర్మమున్నదే — అది పలురాకడలుగావచ్చును. ఆరాకడల ననుసరించి మనబుద్ధికిఁ గల్పనముండవలెను. తెలిసినదా?

వేంక — వట్టియడవి — అధ్వాన్నము — నాకేమియు బోధపడ లేదు.

సోమా — మనుష్యబుద్ధులు కేవలము చపలములు. అందులో స్త్రీలబుద్ధులు బొత్తిగాఁ జపలములు. ఇంతకాలము నాభార్య నాతోఁ గాపురముచేసినది గదా; ఇఁక ముందుమాత్రమెందాలకుఁ జేయదు? అనిధైర్యముగా నుండుటకవకాశము లేదు.

బంగా — ఇదిగో! ఓ! చాలులెండు! మీమాటలుమీరు!

సోమా — నీయొక్కదాని మాట చెప్పలేదు. లోకమందలి

యందలి స్త్రీలకు వర్తించునట్టి వ్యతిరేకసూత్రము చెప్పినాను గాని సామాన్యసూత్రము చెప్పలేదు.

వేంక — సామాన్యసూత్రము చెప్పినావని మీయభిప్రాయము కాఁబోలును.

సోమా — ఏమో! ఏపగలో యేరాత్రియో యెట్లుబుద్ధిపుట్టునో యెవ్వఁడు చెప్పఁగలఁడు? ఉన్నట్లుండి చల్లచల్లఁగ మాయింటిది యిల్లువిడిచి లేచిపోఁగూడదా? అప్పుడుతొందరలోఁ గాళ్లుచేతులువిఱుగఁద్రొక్కుకొనుటకంటె —

బంగా — ఇదిగో! ఓ! చాలు లెండు. నేర్చుకొనిపోయినారు!

సోమా — నీవు బుద్ధిపూర్వకముగా లేచిపోవననినిశ్చయమకటు పుము. దొంగలువచ్చి నిన్నెత్తుకొనిపోఁగూడదా? వెంకటశాస్త్రీ! అమె యేకారణముచేతనైనఁ బరాధీనయైనప్పుడు వెంటనే నేను ఘటశ్రాద్ధము చేసికొనవలసి యుండునుగదా? అందుకొఱకొకచిన్న పాక — దొడ్డిలోఁ గొంచెము దూరముగ — వేయించి దానికొకచిన్న తలుపు తాళంపుటఁగు చేయించినాను. ఇఁక నిశ్చింత. ఆవిడ యెట్టు పైకిపోవఁదలఁపెట్టునప్పుడే కట్టి నేను పాకలోనఁగు బెట్టి తీఱికగా-యథావిధిగా — మనస్సునకు సంతుష్టిగా-ఘటశ్రాద్ధముఁ దంతునాచరించుకొనవచ్చునుగదా?

వేంక — హరి హరీ! లోకవిరుద్ధస్వరూపులగు మీరు శ్రాద్ధపురుషులవలె నవతరించినారు.

బంగా — ఇదిగో! ఓ! చేసిన నేరమే చేసినారు. అంతటితో నూరకుండరాదా? ఈప్రజ్ఞలోకమున కంతకుఁ జాటవలయునా యేమి?

సోమా — కౌనే! నీకుఁ దెలియదు. పూర్వకర్మములలో నొకటిరెండుకృత్యములకు మాత్రమే గోడచాటువ్యాపారము కాని యితర కర్మముల కన్నిఁటికిని బట్టబయలే.

వేంక — కర్మములోఁ గల్పన ముండవలయు నని యిది వఱకుఁ జెప్పితిరి. మీరుచేసిన క్రొత్తకల్పన మిదియా?

సోమా—కాదా మఱి; కవిత్వములోఁ గల్పనము విశేషము కాదు—గానములోఁ గల్పనము విశేషము కాదు— కర్మములోఁ గట్టుదిట్టమైన కల్పనముండుట ఘనత—ఇది నాఁనాఁడు కలిగిన నూతనా ప్రతిష్ఠ.

వేంక—ఇంకను సందేహమా! నాయనా!

సోమా—శాస్త్రీ, తలదాఁపుడుకొల్లు సామాన్యగృహస్థుల యిండ్లలోఁగూడ నుండవచ్చును. ఘటశాద్ధభణణకుటీరముమాత్రము- ఏదీ—మఱియొక యింటిలో ఆసేతుహిమాచలపర్యంతము—

వేంక—మీ వాగ్దోషములు దిద్దలేక చచ్చుచున్నాను. మీరాయిష్టము వచ్చినట్లు మాటలాడుకొనుఁడు. నేను పోయి పండుకొందును. సెలవిండు.

సోమా—శాస్త్రీ! ఉండవోయి! నేనుగూడవచ్చెదను. మంక రోష్మకవ్యాసమును వినుచు, మాయింటి యాఁమె, మఱఁదలు నాటకప్రశంస మానినారు.

బంగా—మేము ముఖ్యముగా వెళ్లెదము, కాని యదినాటకముగాదని మీకెన్ని యుక్తులు చెప్పినను నమ్మకము లేదేమి?

సోమా—నాటకాలంకార సాహిత్యము మావంటిశిష్టాచారవిపన్నులకుఁ దగదనిమాని వేసినంతమాత్రముచేత నాటకమేదో యెఱుఁగనివాఁడ నగుదునా? పురుషులు స్త్రీలు నొకపాకలోఁ జేరి రాత్రివేళఁ జూచువారియెదుట గ్రంథ మెప్పుడు విసర్జించి తెయితక్కలాడుదురో యది నాటకముకంటె నెన్నఁడు భిన్నముకాదు. నాటకములో గాయకులుందురు; నటకులుందురు. నాటక మెవ్వఁడో యొకకవి చేయవలసినది గదా! కవులు, నటకులు, గాయకులు, పంక్తిబాహ్యులు. వారిముఖము చూచునపుడెల్ల సచేలస్నానమాచరింపవలయును. కవి యెప్పుడు భ్రష్టుఁడైనాఁడో యాతనిగ్రంథ మప్పుడే బహిష్కారయోగ్యమన్నమాట.

ఇక్కడికనుఁ దెలుఁగుమాటలచే నంతపట్టుదల లేదు గాని మానాయన గారి చిన్నతనములోఁ గవి యెవ్వఁడైన గ్రామములోనికి వచ్చునరికి వెట్టికుక్కనుగొట్టినట్లు కొట్టువారఁట!

వేంక — ఈగొడవ కేమి? మనవారికిఁ జూడవలయునని కుతూహలముగా నున్నది కాఁబోలు? వెళ్ళనిండు! అది మీరనుకొనినట్లు నాటకము కాదు. దరువులు తాండవములు లేవు నటకులు దానిలో నెవ్వరు లేరు. అది కవిరచియించిన గ్రంథము కాదు.

బంగా — వేంకటశాస్త్రి! నీవాయనకు బాగుగఁ జెప్పుము. అక్కడ దాదినమ్మవేషమో, చెంచులక్ష్మివేషమో వచ్చుననియుఁ, దెయ్యమని యాడుననియు ననుకొనుచున్నారు కాఁబోలు. ఒక్కసారి యా పెద్ద కాగితము చూచి యా సర్కసులో నావిడ చేయు రెండవపని యేదో కొంచెము స్పష్టముగాఁ జెప్పు.

సుబ్బ — మొదటిపనికి మెప్పింత ముద్దైనది! — ఇఁక రెండవది — చాలు.

వేంక — మూఁడువందల పౌనులబరువుగల పెద్దఱాతి నవతః ప్రదేశమున నావహించి దానిపై రెండుసమ్మెటలతోఁ గొట్టించుకొనునఁట.

బంగా — అబ్బా! ఎంతగొప్పదనియో? అంతఱాతి నామె యెట్లుమోయునో? దానిపైని కంగు కంగుమని గొడ్డళ్ళతోఁ గొట్టఁగా నెట్లు సహించుకొనునో? అమ్మయ్యో? ఆమె యెంతగొప్పయిల్లాలో.

సోమా — ఆమెకంటె గొప్పయిల్లాలవు నీవు. ప్రాణహీనమైరసహీనమైనదిక్కుమాలినఱాతిని గుండెపైఁ బెట్టుకొని కంగుకంగుమని కొట్టించుకొను నామెకంటె భీమగజములవంటి కవలపిల్లలను కడుపుపైఁ బెట్టుకొని జువ్వుకుజువ్వుకుమని పాలు గుడువఁ జేసిన నీవు మహాఘనురాలవు. ఆపిల్లలు మనకు దక్కలేదు. దాని కేమి? ఇల్లాలిఘనత పిల్లలను కడుపునధరించి భరించుటలోనున్నది. కాని గుండెపైగుండ్రాయెత్తుకొని మొ

త్రించుకొనుటలో లేదా. వేంకటశాస్త్రీ! ఇదియేమయ్యా! యాగమే మూలఁబడిపోయినట్లు కనఁబడుచున్నదేమయ్యా! వితంతువులాగునఁ జెంగావిచీరఁ గట్టుకొని, నల్లని రవికఁ దొడిగికొని ఋషికన్యలాగునఁ బరిశుద్ధముగఁ బితృదేవతలప్రీతికొఱకుఁ గారెలనిమిత్తమై రుబ్బుఱోలు మీఁద కూర్చుండుగా రుబ్బవలసిన యాఁడుది రుబ్బుపొత్రముతోఁ దలఁ బగుల గొట్టుకొనుట యెందులకయ్యా! ఇది కాంతాధర్మమనియా? ఖ్యాతియనియా? గౌరవమనియా?

వేంక—అవధానులుగారూ! ఖ్యాతిగౌరవముల కెక్కడికి? మీఖ్యాతిమీది. ఆమె ఖ్యాతి యామెది. పెనిమిటి మునుపు ప్రియమే యగునో, కట్టు విడిచ్చిగా నూగునో యుండదో, మున్నటికేమి నో, దరకలుగునో, యని యెంచియిప్పుడే యింటిలో నొక్కొక్క మనుష్యుని కొక్కొక్కకట్టుకుచావోవ్వాడ నని తొలి లేకుండఁ గట్టించి యావశ్యకమగున ప్పుడుసుఖముగా నుపయోగించుకొనవచ్చునని వాని పెంటియలకు లె మీఁదదాఁచిపెట్టు సంత్యకర్మమార్తులకు మీకంటె నామెయే యెక్కు మనకెక్కువయుపకృతిని జేయుచున్నదని నాయభిప్రాయము. స్త్రీలు దృఢశరీరిణులై యుండవలయుననియు, యోగాభ్యాసముచే బుద్ధిసూక్ష్మలత్వముగలవారై యుండవలయుననియు, కష్టమున్న వారు బ్రహ్మచర్యవ్రతదీక్ష నవలంబించి పవిత్రస్వరూపిణులై యుండవచ్చుననియు నామె స్వచారిత్రమున బోధించుచున్నది.

సోమా—అబ్బా! బ్రహ్మచర్యవ్రతదీక్షయు నెంతలఘువుగాఁ జెప్పినావు! ఆదీక్ష స్త్రీలకుండుట కవకాశము లేదని నేను ఘంటాఘోషముగాఁ జెప్పఁగలను.

వేంక—అట్లు సెలవిచ్చుచున్నారేమి? వేదకాలమందలి స్త్రీలు మహాయోగినులై బ్రహ్మచారిణీ శిఖామణులై యున్నట్లువినుచుండుట లేదా?

సోమా — అది యెవఁడెఱిఁగిన మాట? వేదములకర్థము లేనప్పుడా కాలమందలి స్త్రీలిట్టివారని యెవరికి దెలియును? నేనొక్కటే యుక్తి జెప్పెదను. బ్రహ్మచారికిఁ గౌపీనముండవలయును. ఉండితీరవలయును. స్త్రీకిఁ గౌపీనావశ్యత యెచ్చటనున్నదో చెప్పు? కుండలఖండితమైన యీ చెవికదపా. మొలత్రాటికవశ్యత యున్నప్పుడు కౌపీనమునకవశ్యతయుండును. అది లేనప్పుడిది లేదు అందుబ్రహ్మచర్యము స్త్రీకి లేదు. ఉండవలసిన బ్రహ్మచర్యము పురుషులలోనే యొక్కఁడను లేదు. ఒక్కమాయింటఁదప్ప — శాస్త్రీ! నాకు గంపెడు పిల్లలున్నారా! బ్రహ్మచర్యవ్రత మేమాత్రమును బెసగనీయకుండ నిందఱు పిల్లలను గంటిని.

వేంక — అదేమి! అదేమి అట్లనుచున్నారేల!

సోమా — నానిత్యకర్మచమత్కారమదే. వృషఃకాలపూర్వము లేచి విధులు నిర్వర్తించుకొని యగ్నిహోత్రశాలలోఁ గూర్చుండి — అది తపస్సనో — సమాధియను — యజ్ఞమను — బ్రహ్మనిష్ఠయను — నియిష్టము — తిరిగి మూఁడుజాములైనతరువాత లేచి దేహధారణకొంత యావశ్యకమోయంతియే భుజించి మఱల నగ్నిశాలలోఁ బ్రవేశించి దర్భలు తెంపులములు, తిలలు, సుద్దలైనవాసని జూచుకొనుచుఁ బంచాక్షరిస్మరించుచుఁ గూరుచుండెదను. సాయాహ్నము కాఁగానే, తిరుగ నగ్నికార్యమారంభించి రెండుయామములకుఁ బూర్తి జేయుదును. రాత్రిభోజనము లేదు. ఆఁకలియగునెడల సుబ్బలక్ష్మికిఁ జేసినరొట్టెముక్క కొంత ఫలహారముఁ జేసి శివోహంశివోహమ్మనుకొనుచు నగ్నిశాలలోఁ దర్భశయ్యపయి నడుమువాల్చి యట్టె కన్నుమూసియుట్టె వృషఃకాలమున లేతును.

ఇది నాకునిత్యవిధి. ఈచర్యలో బ్రహ్మచర్య వ్రతమునకు భంగముగలుగుట కవకాశమేమున్నదో చెప్పు.

వేంక — ఏమియును లేదు. కాని, కాని,

సోమా — నీకు సందేహమున్న మొదల నేను జెప్పిన దినచర్యలో నేమైన భేదమున్నదేమో, యదిగో మాయింటిదానినడుగుము!

వేంక — అమెనడుగుట యేల ? మిమ్మే యడుగుకొనను. ఇట్టిమీకు సంతానము మాట!

సోమా — అటులడుగుము. మాయింటిది ఋతుస్నాతయై మడి బట్టఁ గట్టుకొని మంచిముహూర్తమున రాత్రివేళ విభూతిపండ్లుదూర్వాలుగోమయము వక్షోరములో నుంచుకొని సంతానాపేక్షచే ముసిముసి నవ్వులు నవ్వుకొనుచు నాయెదుట నిలువంబడును. ఓహో! అభిప్రాయమిదిగదా యని దివ్యదష్టిచే గ్రహించి యామెకుఁ బ్రసన్నుఁడనై యిట్లె యాదరించి యట్లె యాశీర్వదించి శాపివేయుదును. చటుక్కున సద్యోగర్భము. ఇంతే యింటిలోనున్న కర్మరహస్యము. ఇంతే మా సంతానపుఁ గిటుకు. ఇట్లు పూర్వయుగములలో జరిగినది. ఆయనగాచానముగనే యిప్పటివఱకు లాగుకొని వచ్చుచున్నాను. ఇన్ని మాటలేల ? వాల్మీకిమహర్షి యొద్దకు ఋతుస్నాతలై యంబికాంబాలికలు పోయినప్పుడు వాలిసుగ్రీవులను బ్రసాదించి యామహర్షి యాదవకులమును నుద్ధరించినట్లు నేనుమావంశము పితిరుగా నిలువఁబెట్టినాను.

వేంక — అదేమి! అదేమి! భారతము భాగవతము రామాయణము మూఁడును గట్టగట్టి యొట్టఁబొడిచి రసముదీసితిరే!

సోమా — అగ్నికార్యము చేతిలోనున్నవాసి కన్నిపురాణములుకూడ దగ్ధపటల న్యాయము.

సుబ్బ — (అవధారించి) అక్కా! మనకు వేళమైపోవుచున్నది. ఈరాత్రి తప్పకుండఁ బోవలయును.

బాగా — ఇదిగో! ఓ మామాట నేమిచెప్పినారు ?

సోమా — అక్కచెల్లెండ్రిద్దఱు, శంకరా యని సుఖముగాఁబం

చపాళిలోఁ బండుకొనుఁడు. వేంకటశాస్త్రీ! నేనుబోయి యగ్నిగదిలో నడుమ వ్రాల్తును.

వేంక—చిత్తము. నేనుబోయి నాగదిలోఁ బండుకొందును.

(సోమావధాని వేంకటశాస్త్రియు నిష్క్రమింతురు.)

బంగా—చూచితివా! ఎంతఁ జెప్పిన నొప్పుకొనలేదు.

సుబ్బ—పోనీ. నేనొక్కతెను బోవుదును.

బంగా—అయ్యయ్యో! నీవొక్కతెవు పోయినయెడల నింకేమైనను న్నదా? అడుగనక్కర లేదు!

సుబ్బ—తప్పేమియు లేదు, చెప్పకుండ వెళ్ళితివేమని నామగఁడు నన్నుఁ దిట్టునా కొట్టునా?

బంగా—అగు, నేమి? ఒక్కతెవు వెళ్ళుట భయముకాదటే!

సుబ్బ—నాయొద్దనున్న రత్నాలనగలన్నియు దొంగలుతీసికొని పోవుదురని భయమా యేమి? తలయొక్కడు మున్నదైనదో గుండె యప్పుడే జారుడైనది. నెత్తికి మునుఁగెక్కడు వచ్చినదో మన్ను నకు బెదురప్పుడెవదలేనది, నావంటి ముండఘటమునకు భయమేమి? సందేహమేమి? లేనిసుఖము లేనేలేదు; దా—కంటికిని గలియుగము లోని చిత్రములను జూచుటకునైన నోఁచకుంటివా? నేను లేవక తప్పదు. నీవుపోయి పండుకొనుము.

బంగా—ఏమే యింత విఱ్ఱపట్టు! ఆడేరా యేయూలనున్నదో యెఱుఁగము. పోవలసిన వారందఱు బోయినారు. ఒక్కతె వెక్కడ కెట్లుపోవుదువు? బండిమెక్కి పోవుదువన్నఁ జుట్టుపట్టుల బండియే లేదయ్యెను. ఒకవేళ బోవుదువనుకొనుము. తిరిగివచ్చునప్పుడు నీకీయిల్లెట్లు తెలియును? మనగ్రామము కాదుగదా. ఈ వేంకటశాస్త్రియైనను దెలివి, తేట, పేరు, ప్రఖ్యాతి లేనివాఁడు. నీవు తిరుగ నిక్కడి కెట్లు రాఁగలవు?

సుబ్బ—అనేకజనము తిరుగ వచ్చుచుండును. వారితో వచ్చెదను. ఈ యింటిపొరుగుననున్న సాతానిచూడమ్మ నిన్న మనయింటికి నిచ్చెనగొలకు వచ్చినదే; ఆమె సర్కసులోనికి వెళ్ళుట చూచినాను ఆమెను డేరాలో నే వెదకిచూచి యామెయు నేనునుగలసి వత్తుము. భయములేదాలే.

బంగా—ఆమెనీకుఁ గనఁబడునని యేమినమ్మకము ? ఆమె యెక్కడికిఁ బోయెనో? ఇంతయూర నికీయు ల్లానవాలెట్లు తెలియఁగలదే?

సుబ్బ—విఘ్నేశ్వరుని గుడికెదురుగానని యెఱుఁగనా?

బంగా—ఇట్టి విఘ్నేశ్వరుని గుళ్ళెన్ని యీపట్టణమందున్నవో?

సుబ్బ—నాకిన్ని చెప్పకు. నేను బోయెదను.

బంగా—సుబ్బలక్ష్మి ! ఆఁగు. ఒక్కమాట జెప్పెదను. నివొక్క తెవు వెళ్లుటకు నేనంగీకరింపను. ఏమైననరే; మనమిద్దఱము పోవుదము. మీబావగారికిఁ గొంచెము నిద్దురపట్టినతరువాత దప్పకుండఁబోవుదము.

సుబ్బ—నీమగఁడు వట్టిఛాందసపుమండకొడుకు. ఇన్నేమనునో? నివు రావలదు.

బంగా—మతేమియు భయములేక.అయినను నిన్నొక్క తెను బంపుదునా ? ఏమి కానున్నదోయగును. ఇంకను నిక్కడనే మనము మాటలాడుచున్నట్లాయనకు వినఁబడునెడల నింకను బండుకొనలేదేమి యని కేకలు వైచును. కావున లోనికిఁబోయి యొక్కసావుగడియ పండుకొని పోవుదము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.

---



శ్రీ

# కంఠాభరణము

## ద్వితీయాంకము.

### ప్రదేశము—వీధి

[ప్రవేశము—సుబ్బలక్ష్మి బంగారమ్మ]

సుబ్బ—అక్కా! ఇదిగో! ఇదిగో! వారి దప్పులచప్పుడీ వైపు వినఁబడుచున్నదే! ఇటుఁబోవుదము రా!

బంగా—కాదే! ఆ వైపుధ్వనియే యటు వినఁబడుచున్నది.

సుబ్బ—అయ్యయ్యో! ఇది యిదివఱకు మనము వెళ్ళఁనందే కాఁబోలు?

బంగా—ఈదిక్కుమాలిన యూరిలోఁ బోగుపులవెట్టిలాగున నన్నియు నఱతే. తిఱిగింటికిఁ బోవుదమన్న దారి తెలియదే! ఏమి చేయుదము?

సుబ్బ—మఱేమియు భయములేదు. ఈదారినిబోవుదము రా!

బంగా—ఊరు మాటుమడఁగినది మనుష్యుఁడొక్కఁడైనఁ గనఁబడఁడే! అయ్యయ్యో! ఇల్లువదలిపెట్టితిమి. డేరాకుఁ జేరమైతిమి. నడుమ దారితప్పి యల్లలాడుచుంటిమి. ఏమిగతి?

సుబ్బ—భయమేమే! నీవు నావెంటరా!

బంగా—అదిగో! ఎవ్వఁడో వానిధర్మమా యనియిటుల వచ్చుచున్నాఁడు

[పిచ్చివాఁడగు రామశాస్త్రిలు ప్రవేశించును]

రామ—కీర్తన. కమాచ్—మిశ్రచాపు.

పా ధ నీ ధ ప మా ప మ గగా మా
గ మ పా ప పా మా॥ పా॥
దీనిమర్మము దెలియవలెనండీ। జనులారమీరు॥దీని॥
ధా ధ ధా ని ప ధ ధ ని సా స స।
సా స మ గ రి స సా ని ధా ధా॥
బోనులోని యెలుకపిల్లను। మానుబిల్లి మ్రింగఁగానే।
సా స మ గ రి స సా స ధా ధా ధా ని।
సా రీ సా ని ధా ప మ॥ పా॥
చేనులోని గుంటనక్క। చెట్టుమీఁది కోక్కి కూసె॥ దీని॥
మూఁడుమన్నుల ప్రమిదలోపల। మూఁడుపేటల వత్తి మండగ
మూఁడుబోదులూడిపోయి। మొదలుతుదలకె మోసమయ్యె॥దీని॥
ఒకటిపండ్రెండ్రైనయప్పుడు। నాలుగేసునైనయప్పుడు
ఆకుమీఁది రామచిలుక। యష్టసుఖముగనిద్రపోవు॥ దీని॥

బంగా—సుబ్బలక్ష్మి! ఎవ్వఁడో మంచివాఁడే! తత్త్వాలుపాడుచున్నాఁడు. నాయనా! నాయనా! సర్కసుడేరాలోనికి దారియేలాగో రవ్వంత చెప్పునాయనా!

రామ—దారులలోకెల్ల జమీందారి—చెంబులలోకెల్ల జారీ—రోగాలలోకెల్ల మారి—నూత్రాలలోకెల్ల గోరి—క్షేత్రాలలోకెల్ల పూరి—భక్ష్యాలలోకెల్ల బూరి—ఇంతేమాతత్త్వము. జ్ఞానపత్రిము ప్రియమగుటచేత యుద్ధమువచ్చినప్పటినుండియు బ్రహ్మానుసంధానము ఠీకముగ జరుగుటలేదు. అదిగో! అదిగో! కుంకుమబరిణచాటున విభూతిపండు! అదిగో! వహ్వా! మనతిరుక్కా వేరీసమానురాలు! మేము ద్వైతాద్వైతభేదము వదలుకొన్నాము.(ఇద్దఱి నడుమకువచ్చి) ఐరోపాకు నాసియాకు నడుమ ధంధామ్.

సుబ్బ—అమ్మయ్యో! పిచ్చివాఁడు! (పాఱిపోవును.)

బంగా—అమ్మయ్యో!—(మఱియొకవైపు పాఱిపోవును.)

రామ—ఇది నివృత్తిమార్గము. అది ప్రవృత్తిమార్గము. నడుమ మేము త్రిశంకుస్వర్గము.

(నేపథ్యమున.)

అక్కా! బంగారమ్మా! ఎక్కడనున్నావు?

రామ—ఆ. అక్కడనున్నావా? ఇదిగో వచ్చుచున్నాను.

(నిష్క్రమించును.)

[బంగారమ్మ ప్రవేశించును.]

బంగా—సుబ్బలక్ష్మీ! సుబ్బలక్ష్మీ! గట్టిగఁ బిలిచినయెడల వెఱ్ఱిముండకొడుకు ఇక్కడవచ్చునో! సుబ్బలక్ష్మీ! అయ్యో! అదిగో పిచ్చివాఁడు! అమ్మయ్యో! (పరుగెత్తఁబోవును) అబ్బే! లాంతరు స్తంభము క్రీనీడ కాఁబోలు? కాదు కాదు! అదిగో! ఎవఁడో బండివాఁడు కాఁబోలు. కొరడా చేతఁబుచ్చుకొనివచ్చుచున్నాఁడు. సుబ్బలక్ష్మి వాని నిక్కడకుఁ బంపించినదనుకొందును

[ఎఱ్ఱయ్య ప్రవేశించును.]

బంగా—అబ్బీ! మాయమ్మాయి యచ్చట నున్నదా?

ఎఱ్ఱ—ఆ. ఆ. బండి సిద్ధముగ నున్నది. గుఱ్ఱంపుబండిలాగున బరుగెత్తింతును.

బంగా—తలచెడిన కుఱ్ఱది. మా చెల్లెలు—గోవులపంచె కట్టుకొన్నది. అక్కడ నున్నది కాదా?

ఎఱ్ఱ—చెప్పలేదా? మీకు సందేహ మెందులకమ్మా! రండు! ఏమి యొద్దనుకొన్నారు! మేగాలమీదఁ బోవును,

(నేపథ్యమున.)

కీర్తన.

జంఝూటి-చతురశ్రిచాపు,

ధ ధ స సరీగా, గాగా మగరిప పాస॥

నిలుపవెబండీ—పైమీఁద మనసుండె॥నిలుపవె॥

బంగా—అమ్మయ్యో! పిచ్చిముండకొడుకు తిరుగ నిటకువచ్చు చున్నాఁడు! త్వరగాబండి తోలించుకొనిపోవలెను. బండివాఁడా! త్వరగ రా! (సంజ్ఞఁజేయును.)

(ఇద్దఱు నిష్క్రమింతురు)

రామ—[ప్రవేశించి.

ధధససరీగా, గాగా మగరిప పాస॥

నిలుపవెబండి—పైమీఁదమనసుండె॥నిలుపవె॥

మామ మగమ పాపాప ధాధా నిధ పమ పాప।

సందుదాఁటిన తరువాత, సంతర్పణున్నది

ధాధధానిధ పమమామ, మాధపమాగా సాస

కడుపునిండభుజియించి, కౌఁగిలించుకొందము ॥నిలు॥

ఆఁడు లేడికన్నులున్న బోఁడిదానిఁజూడఁగానె

చెంపమీఁద మన్మథుఁడు చెప్పుఁదీసి కొట్టినాఁడు॥నిలు॥

గుడ్డికామిఁగాని శాలువబాణము వెఱ్ఱరామిగాఁ ప్రసాదము.

(నేపథ్యమున) ...లు! త్వరఁగాడోలు! అమ్మో! సుబ్బలక్ష్మి!

రామ—అదిగో! పోయెదను. పైదిజ్ఞానమార్గము. క్రిందిదికర్మ మార్గము. ఇదేదో చూచినతరువాతనది. (నిష్క్రమించును)

[సుబ్బలక్ష్మి ప్రవేశించును]

సుబ్బ—ఎచ్చటవెదకినను మామయ్య కనఁబడలేదు. ఇంటికిఁబో వుదమన్న సిగ్గైయుఁగను. ఎవఁడైనఁగనఁబడునేమోయని చూడఁగ నెవఁడు కనఁబడకుండనున్నాఁడు. కనఁబడినప్రయోజనముమాత్రమేమున్నది.

ఎవనియింటికి దారిచూపుచుని యడుగును? వేంకటశాస్త్రి యింటిపేరే
దో నోటనాడుచున్నట్లుగాని జప్తికిరాకున్నది. అదిగాక — మాయక్క
గాకుండ నేనింటికే మొగము పెట్టుకొనిపోదును! అక్కనుబట్టి భావశా
సి యంతకంటె నేమున్నది' మాయక్కమాత్రి మిల్లెల్లు చేయును? మా
యక్కకేమియాపదవచ్చునో యనిమాత్రము విచారించుచున్నాను.
నావిషయమైనాకుఁ జింతయేమియులేదు. ఇప్పుడేమిసుఖ మేడ్చినది
గనుక నా — ఇఁకముందుకు గష్టమువచ్చునని విచారించుటకు? పిచ్చివానికి
మాత్రము కనఁబడకుండఁ దప్పించుకొని తిరుగవలయును. చలివేయునే
మోయని యాకచ్చడముఁ దెచ్చుకొంటినిగదా! ఇదికప్పుకొని ప్రచ్ఛ
న్నముగ మాయక్కకొఱకు వెదకుదును. ఎక్కడనైనఁ దగినతావు
దొరికినయెడలఁ దలదాచుకొందును. ఇదివఱ కెప్పుడిట్టిసంగతులనెఱుఁ
గనిదానను గాను. అయిననేమి? ఆవశ్యకమే ధైర్యగుణమును వృద్ధిపఱ
చును. అదిగో! పిచ్చివాఁడు వచ్చుచున్నట్లున్నాఁడు! తప్పించుకొని
పోవుదును,( సుబ్బలక్ష్మి నిష్క్రమించును)

[రామశాస్త్రి ప్రవేశించును]

రామ — "మనఏవ మనుష్యాణాం జాయతే వర్ణసంకరః" అను శ్రు
తియందతివ్యాప్తిదోషము తెచ్చిపెట్టినది. కట్టకపోయిన యెడల
మనకీకాలునొప్పి యేలవచ్చును? అనఁగా విషయమువలన విషయ
ములు, విషయమునందు ఏయుక్తిని ధ్యానము గానేరదని యెఱిఁగియుం
డియుఁ బోవుటవలన సమోహాలు బొందుటకు హేతువు దార్ఢ్యనిష్పన్న త
సదించినది. కవలిక ఈమోహాలు కావు. ఇది — ఇఁక ముందు "అథా
తో బ్రహ్మజిజ్ఞాసా" యనుసూత్రమునబడవలసినదే కాని కర్మకాండములో
గింతులువైచినలాభము లేదు. బేరము, బేరము బేరము కోమటికప్ప
లఱచినంత మాత్రముచేత వర్షము కురియునా? "అహింసాపరమో
ధర్మః" యను శ్రుతి సంగ్రహించినంత మాత్రముచేత బౌద్ధమతము వై

దికమతమగునా? అసత్యము—అసత్యము. అయినను వ్యవహారము నందన్నియు సత్యములనక తప్పదు. ఇదిగో నిలుచుగొట్టము! ఇది వ్యవహారజ్ఞానము. గుంటపల్లి భాస్కరునిపేరు చెప్పి—అద్దెద్దె—హూంత్. ఇదిపరమార్థజ్ఞానము. ఇంతే—కనుకట్టు—మహామాయ. పరికృతిపన్నులచిన్నలవేశ్యాపరాత్పరుఁడు వేపారివాఁడు. పరిపంచనాటకమంతయు వేపారివేశ్యాసహావేశమే! హాహాహా (నవ్వుచున్నాఁడు.)

[కృష్ణరావు సుందరి ప్రవేశించుచున్నారు.

కృష్ణ—గీ. పంచదారకంటెఁ బరిపక్వమైనట్టి
తియ్యదాక్షకంటెఁ దేనెకంటె
వెన్నపాటలేల యివియానుంగలిపిన
ముద్దకంటె వేశ్య ముద్దుదీపి.

ఏదీ మఱియొక్కటి!

సుంద—చాలులే. వేశ్యముద్దులు వేపారిసంతులు సుద్దులకంటె నెక్కువ తీపికావు. నన్నవతె నమ్మునా? నీవెన్ని భాగవతములాడి యిక్కడకుఁ జేరితివి. ఎంత వేసగాఁడవు ఎంత మోసగాఁడవు!

కృష్ణ—ఆ. నేను వేగుళ్ళపూజారినే—దినదినైకనూతనవనితాప్రియుఁడనే. అయిన నేమి! వెనుకటివన్నియు గతించినవి. ఏదీ! నీయింటిలోఁ బ్రవేశించినతరువాత నాకన్నునీమొగముపైనుండా? నాలుగడుపదాఁటెనా? గోడకుఁగట్టినబొమ్మ—గాగరాకు గట్టినబొంగు—కాలి క్రిందఁబెట్టినపీట—ఆ. ఇంటివైపు మొగముకు లేదు; ఇల్లాలివైపు తలఁపు లేదు. ఏకాదశీఫలహారమిచ్చుటనే; ద్వాదశీపారణ మిచ్చుటనే—ఈనడుమ మాతల్లిగారిఛటకముగూడ నిపశువులపాకలోనే కడతేర్చితినని యెఱుఁగవా?

సుంద—ఇంటివైపు మొగము లేదని—ఇల్లాలవైపుతలఁపులేదని యింత దేవులాట యెందులకు? పోలేక పోయినావా? నివ్వాపిసహా

రెవరు? పట్టుమని పదునెనిమిది మాసములైనఁ గాలేదుగదా—ఇంతలోనే యింత బెంగ పెట్టుకొన్నవాఁడవు నివలన నాముచ్చట లెట్లుతీరఁ గలవు? వదవద! మగవానిని నమ్మినయాఁడుదానిని ముక్కుఁజెవులుఁ గోయవలయును.

కృష్ణ—సుందరీ! యెంతమాట! ఒక్కనిముసమైన నిన్ను వదలియుండగలనా? షష్ఠి పూర్తి జేసికొనుచున్న నుబ్బుసెట్టియింటికి నీవు మేజువాణికై యిప్పుడు పోవుచుంటివికదా—ఇప్పుడుకూడ నివెంట నే నేల యుండవలయును?

సుంద—నిన్నుఁ మాత్రమాతఁడు పిలువలేదా? నీవు కూడ నక్కడకే పోవుచుంటివి?

కృష్ణ—నన్నుఁ బిలిచినాఁడు కాని నివెంటరమ్మని పిలిచినాఁడా?

సుంద—నీకేమి యనుమానముండి వచ్చుచున్నావో?

కృష్ణ—హరిహరీ! నాకు నీయెడల ననుమానము లేదు. అనుమానము లేదు. నరేనా.

రామ—అదితప్పు. ప్రత్యక్షశబ్దములతో ననుమానముఁ గూడఁ బ్రమాణముగఁ దార్కికు లంగీకరించినారు. అయ్యా! మీరు చార్వాకమతస్థులు గారుగదా—

కృష్ణ—మేము మాధ్వమతస్థులము.

రామ—వేసారుఁ—నాయనా! వంశమునకు మణిపూసవలెఁ బుట్టినావు. ఈమె వేశ్యాంగనగాఁబోలు?

కృష్ణ—ఔను. ఈమెకు నాకు సంబంధము.

సుంద—సిగ్గులేక నడువీధిలో నట్లు చెప్పెదవేమి?

కృష్ణ—సిగ్గుపడవలసినది కాదు. సంబంధమీనాఁటిది కాదు. వస్తువులవలెనే సంబంధమనాది. కాని వస్తువు లీశ్వరకల్పితములు. సం

బంధములు మాత్రము మనము కల్పించుకొనినవి. కాని మీసంబంధ మేసంబంధము? సమవాయసంబంధమా? తాదాత్మ్యసంబంధమా? విషయవిషయీభావసంబంధమా? లోకానుభవమునుబట్టియుత్తరోత్తరముగ మీఁదవది బలిష్ఠమైకనఁబడుచున్నది. నేను వెఱ్ఱియాసుపత్రిలో నుండఁగా నక్కడనుండిన యొకమిస్సమ్మకు నేను గన్నుగీఁటినానని దానిమగఁడు నన్నుఁ గఱ్ఱఁదీసికొని వేసినాఁడు.

కృష్ణ—వెఱ్ఱివాఁడా! తప్పు! మిస్సమ్మకు మగఁడుండఁడు. మిస్సనఁగా నింగ్లీషులోఁ గన్యకుఁ బేరు. మగఁడు లేకపోవుటచేతనే యామె మిస్సమ్మయైనది.

రామ—కాదు కాదు. మగఁడు లేనిది పతంతువని నను స్మృతిలోఁ జూపఁగొట్టి శాసించినాఁడు రజ్జుసర్పభ్రాంతి యొక్కటియే యద్వైతమునకు గట్టిపట్టు. ప్రపంచమంతయుఁ బ్రకృతపురుషసంబంధ వేశమే. కావున నిమోయుందు నీకు సర్పభ్రాంతివదలిపోయిన తత్క్షణము నీ కొంతుకకు రజ్జుత్వమా మాత్రము శాశ్వతముగాఁబట్టియుండు. యీద్వైతములాగున మాది పెసరపప్పుమతము కాదు. పంతులుగారూ! మీయొద్దసత్యమున్నదా? నాయనా! పిండివంట—వహవ్వా! పిండివంట_వంటికుఱ్ఱదానిని సంపాదించినావు. గారెలవంటికన్నులు, బజాఁను కాజావంటి పెదవులు—చక్కిలాలవంటి చెవులు-పాలముంజవంటిగడ్డము, అప్పడమువంటిమొగము, వడియమువంటి ముక్కు ఉండరాలవంటి—

కృష్ణ—ఉండు! ఉండు! అంతటితో నాఁగు! సుందరీ! ఇతడు కవివలె నగపడుచున్నాఁడు. అయ్యా! నీవు కవిత్వము నేర్చుకొంటివా యేమి?

రామ—తగినవాఁడవయ్యా! బాగుగాఁ గనిపెట్టితివి.

"క. వేసారికంటె నరకుఁడు" పద్యము ముక్కుతోఁ జదివినఁగాని మోక్షము లేదు.

వేఁసారకంటె నరకుఁడు
నేపాళపుమాత్రకంటె మేలౌ మందుల్
వేసారుకంటెఁ జేటును
నాపాటునకంటె సుఖము నహి హిమహిలోకన్.

వాంచారమ్మగారికి నవ్వొసాహేబుకు నిజాము రేవున మణివిషయమైన కట్టుదల వచ్చినప్పుడు మేముమాధ్యస్థ్యముఁ జేసి ప్రతిపాదించిన దేమనఁగా:—

తిరుమణియైనను సరియే
చెడఁ బెఱిగిన గడ్డమైన మఱియుఁ సరియే
వరబ్రహ్మరూపు లిద్దఱు
సుఖసంగతినుండుఁ డింక వైరంబేలా'

కవులూరువారి కవిత్వము మాకవిత్వము నొక్కటా కి-వారికి యతిలేదు. మాకు మతిలేదు. వారికి ప్రాసము లేదు. మాకు ధ్యాసము లేదు. వారికి గణము లేదు. మాకు గుణము లేదు. వారికర్థము లేదు. మాకునర్థము లేదు—గంజాయి సిందుకొన్నది పంతులుగారూ! ఒక్కపావులా కాసిప్పించెదరా?

కృష్ణ—నీవు పద్యకవిత్వమే కాక పదకవిత్వముఁ గూడ నెఱుఁగుదువా? ఒకతత్త్వము పాడినయెడల నేమైన నిచ్చెదను.

రామ—నీది శీతపిత్త తత్త్వముగావున శృంగారతత్త్వములో వేదాంతముఁ గలిపి పాడెదను.

కీర్తన—బేహాగ్—త్రిశ్రిచాపు

మ గ మ ప సా ని స రీ స ని సి ధ ప ప మ గ గా,
మ ప మ ప గా రి సా పా పా మ ప ధ ని స ని ధ పా॥

అతివసొగసు లెన్నఁదరమె యజునకైనను వయ్యారి ॥అతి॥
గ మ ప ని ని, ని స రీ స ని ని ధ పా పా పా ప మ పా ధ
ప మ మా గా

వన్నెలాడిమోము—వెక్కిరింపఁగఁజాలును, సోము
పా పా పా ప మ పా ధా ప మ మా గా గ మ ప స సా నీ
ధ ప మా గా ప మ మా గ రి స సా స ॥
గోములకెల్ల గోము—అది మారుని వేఁటలో దీము
వయ్యారి॥అతివ॥

కులుకులాడివినగలు—దాసిమేనను మగరాయనగలు
సోగకన్నులుచూచిన, దొగలు—దానికూరివారందఱు నుగ
లు వయ్యారి॥అతివ॥

ముసిముసినవ్వులఁ బొల్పు—కల్లకులుకులఁ దేనెలరాల్పు
జారుపైఁటను హొయలుగఁదాల్పుఁ—దుదకఁదఱి కొంపలఁ
గూల్చువయ్యారి॥అతివ॥

వెఱ్ఱిరాముమాట—మేల్మైలెనసితులమాట
పాటలకెల్ల, బాట—అది సంపెంగపూవులతోఁట వయ్యారి
అతివ॥

కృష్ణ—అహాహా! ఏమిపాట పాడితివి! సుందరీ! చూచితివా? పైకిఁబచ్చిశృంగారము లోపల బరమవేదాంతము. ఇతఁడు జాతీయకవి. ఆంధ్రదేశమున కిట్టినవ్యకవిత్వమే యిప్పుడు కావలసియున్నది. నూతనవ్యక్తులు—నవనవాదర్శములు——జాతీయసమస్యలు—మతముతో జోడించి యితఁడు కవిత్వములో నిమిడ్చినాఁడు. తాడులేని బొంగరమెట్లు తిరుగదో, మతములేని కవిత్వమట్లు వర్ధిల్లదు. ఇదిగో నయ్యా! నీవిదితీసికో! (అని పిడికెడుడబ్బులు తీసి చేతికిచ్చును.)

రామ—(తీసికొని) కృష్ణార్పణము కృష్ణార్పణము.

కృష్ణ—మేము షష్టిపూర్తి చేసికొనుచున్న సుబ్బిసెట్టియింటి

కింబోవుదుము. మీరక్కడకు వచ్చినయెడల మతియేమైన దొరక గలదు.

రామ—నీవుకూడ నీమెంతో నక్కడకుం బోవుటయెందులకు? ఈమెకుం జిప్పతాళపుటంగు చేయుదువా యేమి? తప్పలేదు లే. వైష్ణవులేమి, శ్రీవైష్ణవులేమి—సానులవెనుక దధిగిణతోం తకదధిగిణ తోమ్మను నాచారమున్నది. నేవింక డిక్విక్వి టిక్విట్టం—(ప్రవక్కిమిం చును.)

కృష్ణ—సుందరీ! పిచ్చివాండు నడుమ నడుమం దెలివితో యు క్తియుక్తముగా మాటలాడుచున్నాండు.

సుంద—ఆతనికింబిచ్చి యెక్కడిది? నడుచువాండు—పిచ్చి శ్ళులస్తవలె నున్నాండు—ఏదో మదసంబంధమైన స్వల్పవ్యత్యాసమని యేంచుచున్నది. అండు దాని చేయి తగులంగనే యది యంతయుం బా ఱిపోవును.

కృష్ణ—అండు దానిచేయి దగులుటచే నంత వెట్టియుం బోవునని చెప్పితివిగదా—నిచేయి నాకుం దగిలినకొలంది నీయెడల నాకు వెట్టి హెచ్చగుచున్న దేమి?

సుంద—వెట్టులలో ననేక జాతులున్నవి. నీవెట్టి—చేసికొ న్న భార్య చెప్పుదెబ్బలతోంగాని వదలదు. నిన్ను నాయింట దాసుని జేసినానని—నిమాన్యములు నేను వ్రాయించుకొంటినని—నీకు నీ భార్యకు విడాకు లిప్పించినాననని—నీమామగారు సన్నన రాని మాట లాడుచున్నాండంట. నాకుశృంగభంగముం జేయునంట. నాకీరట్టెందులకు? వారికీ బాధయెందులకు?

కృష్ణ—నాయత్తమామలకంటెను నీవే యెక్కువ యభిమా నముతో నాకు బుద్ధి జెప్పుచున్నావుగదా—ఇట్టి యోగ్యురాలవగుల నిన్ను విడిచిపోవుటకంటె విశ్వాసహైన్యముండునా?

సుంద—విశ్వాసమున కెక్కడికి? వెనుక విడిచిన నాసవతు లనందఱను విశ్వాసముచేతనే విడిచితివి కాఁబోలు? విటునకు విశ్వాసమేమి?

కృష్ణ—వారు నీసవతులని చెప్పుటకుఁ దగినవారా? కుక్కతల దాఁకతె—బాకినోటి దాఁకతె—ఇటులే—ఇటులే వట్టిబొగ్గేదో, వజ్రమేదో, ముండ్లపోఁటకూర యేదో, పుష్పించిన లతకూన యేదో, బొమ్మజెముడుకంప యేదో, పారిజాతపుగున్న యేదో, యెఱుఁగని యజ్ఞదశలో నేమి జరిగినదో జరిగినది. అట్టి పూర్వసంబంధములు విడుచుట విశ్వాసహైన్యమగునా?

సీ. వెంపలికంపలోఁ బెంపేదిఁ మదేభ
మంభోజసరసిలో నాడఁదగదె
కాకిమూఁకలను జీకాకునొందుపికంబు
తీయమామిడిపైఁ గూయఁదగదె
ఉమ్మెత్తపూలలో దిమ్మత్తినయళీంద్ర
మెట్టగులాబిపై నెగయఁదగదె
కలుగుల సిలుగొందు కాలాహి మలయజ
కుజవల్లిఁ జుట్టుకొనఁగఁదగదె
అత్తకోడండ్రగృహకలహములనఘుమ.
పాట్లుపడు కవిసింహము పరమరసిక
పండితవదాన్యకరుణార్ద్ర భావభవ్య
రాజమార్తాండ సభను జేరంగఁదగదె?

సుంద—కాని, యీశృంగారప్రబంధము నేఁడు నడువీధి నారంభించితివేమి? మన మెచ్చుటకుఁ బోవలయునో మఱచితివా?

కృష్ణ—అదిగో! కోమటిపిల్లు—ఇఁకఁ గొంచెము వ్యవధి యున్నది. కావున నేదియో నాకడుపులోని మమకారము దాఁచుటేక

ము లేక వెల్లడించుచున్నాను. ఇంతవఱకుఁ బిచ్చి వానిగోలఁబోఁడనే
యైనది. ఇప్పుడిప్పుడే కాఁగా రవంత వలుకనీ, కులుకనీ, చూడనీ,
దానిని—(దగ్గఱకువచ్చి మీఁదఁ జేయివైచును.)

సుంద—చూడుమంతులూ! నిజముగా నేనంతచక్కనిదాననా?

కృష్ణ—ఎంతచక్కనిదానవో నేను జెప్పఁగలనా?

గీ. లేడికన్నులు గలుగుపూఁబోఁడివీవు
చెక్కుగుంటల సొగసగు చేడియీవు
చక్కఁదనముల మక్కువ చానవీవు
మరునిగజ్జెలగుజ్జుమా మగువవీవు.

సుంద—ఏమీ! ఎంతచక్కఁదనమున్న నేమి? అదృష్ట
మండవలయును. సంగోఁ జకోరాక్షికిఁ బిల్లికన్నులే గావా? దౌష్ట
యమువంటి సౌభ్యవర్తకునిఁ జేబట్టినది. నాలుగంతస్తుల మేడ—నిలు
వుటద్దాలు—తూఁగుటుయ్యాలలు—నాగరా గుమ్మమున బిగించుట కొఱ
దాసి—జారిపోయిన పైఁట సరుగుట కొకదాసి—ఏవాఁడు నైశ్వర్య
మెఱుఁగక యూరి యూరఁబ నవలెనన్నది. అయిన నేను ఐశ్వర్యముచేత
నిష్పడామెయే రంభ మున్నఁజూచితిని. బండిపట్టయంతయొడ్డాణము
పెట్టుకొన్నది. దీనపొగసుమండా! పెద్దచేగోడీయంత సత్తు పెట్టుకొని
నగలు నాణెములు లేసి నన్నుఁజూచి యెక్కసక్కెముగా నవ్వినది.
పోవేపొగరుబోతా! నీయైశ్వర్యమంతయు నాయెంగిలికూడే కాదఁటే
యని నాలో నేననుకొని గిఱుక్కున నింటిలోనికిఁ బోయితిని.

కృష్ణ—ఎంగిలి కూడేమి?

సుంద—భార్యపోవఁగనే యాలబ్బివాఁడు మాయింటికివచ్చి
"నాయాస్తియెల్ల నీది; సమస్తము నీపేర వ్రాయించెదను, నీవు నన్నుఁ
గనిపెట్టియుండు" మని చెప్పినాఁడు. బతిమాలినాఁడు. పైవారిచేతఁ
జెప్పించినాఁడు. పాదాలమీఁదఁ బడినాఁడు, అంతకంటె నాతఁడేమిచే

యుఁగలఁడు? నాఁకటు మన సీమాత్రమును బోలేరు. అయినయింటి దానను గనుక మర్యాదకొఱకుఁ బెద్దపెద్దచూపులతోనే కాలక్షేపము జేసితినిగాని నీచవృత్తికి దిగలేదు. మతమని, మడికట్టుకొనుటయని, పూజజేసికొనుటయని, నియమమూంచుకొని యిప్పటి మూలకూళ్ళ కొడఁబడక పోవుటచేతి నిప్పుడు మాకొంప యయ్యవారలుగారి నట్టిల్లు—వీధిగుమ్మమునుండి బంతులు, పెరిక గుమ్మమునుండి బంధులు—ఇంతే మా సౌభాగ్యము.

[ నేపథ్యమున ]

పంతులుగారింక రాలేదు. కార్యక్రమములో నాయనకుఁ గూడ నొకపద్దున్నది. ఆయనకై వచ్చుమనే యుందురు గనుక సభయారంభింతము. జయ ఆంధ్రమాతృకు జయ, జయఆంధ్రమాతకు జయ.

సుంద—అదిగో! చూచితివా సభ యారంభమైనది? నావెంట రాకుము! నీవటుఁబో! నేనిట్లు పోయెదను.

(నిష్క్రమించును)

కృష్ణ—ఎంతమాటయన్నదో! "వీధిగుమ్మమునుండి బంతులు, పెరికగుమ్మమునుండి బంధులు!" ఆహా! పౌరుషముగలవాఁడను గాని బందనుగానే! అమితమైన చనవుచే వాడియుంటినా? సుందరియను భామ శ్రీకృష్ణుని దన్న లేదా? అంతే సుందరియనుభామను యీకృష్ణుని దట్టుటయంతకంటె నెక్కువదా? ఆయన సహించియుండ లేదా? నేనుమాత్ర మేల నోరుమూసికొనియుండఁగూడదు? వేశ్యమాత చేతిలోని తెడ్డు నొకసారి నాపై వేయఁగ నుదిటికి దెబ్బతగిలి గిలాచ్చుకొని పోయితినే! అప్పుడే శాంతతను వహించిన నేనిప్పుడేల గంతులు వేయవలయును? శాంతివహించక చేయునలసినమాత్రమేమున్నది? గౌరవించుకొనుటకుఁ గోత్రకాసులేదే! ఉన్నధనమంతయు గానసభలని, నాటకములని, మేజువాణులని, వెచ్చించితినిగదా?

అందఱు—జయ, కన్యకాపరమేశ్వరికి జయ, సుబ్బిసెట్టికి జయ జయ, చిల్లరదుకాణమునకు జయ, జయ గల్లాపెట్టెకు జయ!

కృష్ణ—(ప్రవేశించి) జయ పిచ్చుకుంచమునకు జయ! జయ తక్కెత్రాసునకు జయ. జయ సుబ్బిసెట్టి తామరకు జయ.

సుబ్బి—వారెవ్వరు? వేపారికంతులే! అబ్బో! అబ్బో! వేళాకోళాలకంతులే! ఇదిగో! ఇదిగో! దండాలుగండాలు!—చూడు కంతులూ! మనకీయవలసిన చిల్లరమూట మఱచియేపోయినావు? నిక్కచ్చిగా నున్నది.

కృష్ణ—అందుకొఱకే యింత పేచాలస్యమైనది. రావలసినసొమ్ము చేతికి రాలేదు; తెల్లవాఱకుండఁగనే మాభటులచేతఁ బంధింతును. కాని నీకీయుత్సవసమయమున మూలోకవర్ణాలు రాఁబట్టుకొను దేవులాటయేల? రవంత నీవు, నిత్యకర్మలాగున నిశ్చింతగాఁ గూరుచుండరాదా? అదేమి! మొండిగోడమీఁదఁ గొండముచ్చువలెఁ గుర్చిమీఁద గొంతు కూరుచుంటివేమి?

సుబ్బి—గల్లాపెట్టెయొద్దఁ జడికిలఁబడవలసిన కోమటివారము కాదా? మీవంటి పెద్దయుద్యోగస్థులకుగాని మాకుఁగుర్చియేలను? వెంకటప్పయ్య బలాత్కరించి యీకుర్చిలో నున్నదింపినాఁడు కంతులూ! కాళ్ళు క్రిందఁబెట్టుకొని కూరుచుండినఁగాని సరిగా నుండదాయేమి: (కాళ్ళు క్రిందఁబెట్టుకొనుటకుఁ బ్రయత్నించును.)

అబ్బో! అబ్బో! హా—వెంకటప్పయ్యా! పైస రవంత యూఁతగా బట్టుకొనుటకు దుకాణములోని త్రాసుకట్టలేక పోయినా వటోయి?

వెంక—అదిగో! అది, అది. ఆ. కాళ్ళక్రిందకువచ్చినవి రెండు! ఇఁకఁ దొందర లేదు. ఒకపూటకునికి దుకాణంపుఁదాళ్ళు తెంపుట యెందులకని యుపేక్షించితిని.

సుబ్బి—పంతులూ! ఈసారిచూడు! ఠీవిగానూ జోరుగా ఉన్నానా?

కృష్ణ—ఆఠీవి యేమో జోరేమో నాకేమి తెలియును? ఇదిగో సానివారి చక్కని చుక్క యున్నది. దానినడుగు—సౌందర్యగ్రహణ పారీణులగు సత్కవు లున్నారు, వారినడుగు—

సుబ్బి—పంతులూ! సత్కవీశ్వరులు సానివారికంటె నెక్కువ యని స్థిరపఱచినావంటయ్యా! నాకాకవిత్వంపు గొడవ యేమియుం దెలియదు. నాకెంతసేపు తోచెడిది—నాపుట్టువను వారు సానియే పైచేయి యనిన నమ్మకము. వారికేమి—విశేషములాగున సందడు వారిఇంటికి ముడుపులు, కానుకలు, కోకలు, రవికెలు, నగలు, నాణెములు పట్టుకొనివచ్చి వారికి సమర్పింతురు కదా? వారి వ్యాపారమువంటిసుఖమైన వ్యాపారము [illegible] లేదుగదా?—పెట్టుబడి లేదుగదా? ఆదాయపుపన్ను లేదుగదా? అరువుబేరాలు లేవుగదా?—[illegible] లేదుగదా?—ద్వాదశవర్షక్షామము పట్టినను వారివర్తకము జరుగునుగదా?—ఎక్కడనో యుద్ధాలు వచ్చినవి. సరకు లేదు. [illegible] కూరుచున్నారు.—వారికి ఆ బాధ లేదుగదా?—దివాలాగొడవ మొదలే లేదుకదా? వారి వ్యాపారమే వ్యాపారము వారిజన్మమే జన్మము. అదృష్టవంతులు సుఖజీవనులు. అందుచేత సానులనుజూడ నాకు మిక్కిలి ముచ్చట—ఏది వెంకటప్పయ్యా! సుందరి నీలాగున బిలువవోయి? ఇక్కడినుండి చూపుబాగుగా నానను.

వెంక—సెట్టిగారిసెలవైనది. దగ్గఱకు రమ్ము సుందరీ! సందేహింతువేల! రా.

సుంద—ఎందులకు. అక్కఱ లేదులెండు (సిగ్గునటించును)

సుబ్బి—ఇదిగో! పంతులుగారున్నారుకదా! ఆయన సెలవు

లేకుండ వచ్చినా! పంతులూ! పిలువవయ్యా యొకసారి.

కృష్ణ—సుందరీ! రా! సెట్టిగారియొద్ద సిగ్గేల.

సుంద—(సమీపించును)

సుబ్బి—అబ్బో! అబ్బో! వహవ్వా! వహవ్వా! నాటకములో బొమ్మలాగు నున్నావు బఁగారసుకోకయే! పంతులుగారు పెట్టినదే? పదునెనిమిది మూళ్ల నాఁక నున్నట్లున్న దే?

సుంద—పదునాలుగు మూళ్లు.

సుబ్బి—పదునాలుగే యైనయెడలఁ బెద్దగుమ్మటము లాగున నింతలావుగా నున్న దేమి?

కృష్ణ—గాఁగరామీఁదఁ గట్టుకొనుటచేత నట్లున్నది.

సుబ్బి—కొట్టులోని రహస్యాలు కోమటయ్యకుఁ దెలిసినట్లు వేపారిపంతులకు వేశ్యలయుట్టు పుట్టానవాళ్లన్నియు బట్టబయలు; వహవ్వా! చెంగులన్నియు మామిడిపిందెలే. ఇదేమి గంటల యొడ్డాణమా? ఎన్ని మువ్వలున్న వే! మదరాసు సుబ్బారావుగారి భార్యసరకు కాదు గదా! అబ్బో! అబ్బో! అత్తరుసాహేబులాగుఁ గమగమలాడుచున్నావు. సాహేబనఁగా జ్ఞప్తికి వచ్చినది పంతులూ! నీవు నాటకాలకోసరము తెప్పించుమని చెప్పిన గడ్డాలు, మీసాలు, తలకట్లు, కుస్తులు విడుదలవాకుండ నున్నవి. నిన్న నమ్ముకొని తెంప్పిచినవి, రూపాయకొక యర్థరూపాయ లాభము చొప్పున నవియన్నియు నీవేపుచ్చుకొమ్ము. మాకు వడ్డితగులు బాటగుచున్నది. వహవ్వా! సుందరీ! ఏది! ఏది! (సుందరిచేయి పట్టుకొనును)

సుంద—సెట్టిగారూ! చేయి వదలుఁడు!

సుబ్బి—కొత్తమొగమా! సిగ్గెందులకు? నేను బెద్దవాఁడను గదా? మీయాయన యిక్కడనే యున్నాఁడుగదా? ఇంక బిడియ మెందులకు? వ్రేళ్లయుంగరము లేపాటివోయని చూచుచున్నాను.

చూడు! నీమొగము కొంచెము వంచు. నామీఁద పైకిలేవకు.

సుంద.—నేనేల వంగవలయును?

సుబ్బి—చెవులదుద్దులు చూడవలయునులే. నాలాగున నీకు నడుము లావులేదుకదా? సలాకలాగున వంగఁగలవు

సుంద—(వంగును)

సుబ్బి—వహవ్వా! రవ్వలదుద్దులే? (అపవారించి) సుందరీ! ఈచీరమూలముననే గాఁబోలు నీవీరాత్రి నాకు రంభలాగునను న్నావు! వెనుక నెప్పుడు నాకీలాగునఁ గనఁబడలేదుసుమా?

సుంద—సెట్టిగారూ! నన్నువదలుఁడు. (దూరముగాఁబోవును)

కృష్ణ—సెట్టీ! కాలుతిరుగఁ గుర్చీపైఁ బెట్టితివి!

సుబ్బి—పంతులూ! ఈకాలూరకే సలుపు.

శివ—అవును. వాఁచినట్లుగూడ నున్నదేమి?

సుబ్బి—ధాన్యముకొలకుఁ దూర్పుపోయినప్పుడు తెచ్చుకొన్న విశాఖపట్టణంపు భాగ్యాలు. వెంకటప్పయ్యా! ఇప్పుడు జరిగింపవలసిన తంతేమి? ఏదో లఘువుగా మాత్రముగాని. అట్టిపెద్దపటుగులెత్తి కాళ్లు విఱుచుకొన్న లాభములేదు. ఇదిగో! విన్నావా? ఆ! ఆవెనుకఁ జెప్పలేదనుకోక—

వెంక—ఇదిగో! కార్యక్రమము.

సుబ్బి—కార్యకర్మమనఁగా నాకేమి బోధపడును? వెంకటప్పయ్యా! అయ్యో! అన్నిదీపాలు పెట్టించినావేమి? తగ్గించు—సుందరి మొగముమీఁద మాత్రము ప్రకాశముగా వెల్తురుండునట్లు పెద్ద దీపముంచుము—మనమేమి సంసారులము కామా? ఈనాటి యుత్సవాలతో మన్నుగొట్టుకొని పోవుదుమా? వెంకటప్పయ్యా! అదేమో చూసి!

వెంక—మొదటిది దైవప్రార్థనము శివయ్యశాస్త్రులుగారు,

సుబ్బి—ప్రార్థన గాలేదటోయి! దైవప్రార్థనము తిరిగి పెట్టినా వెందుకు? ఈదైవప్రార్థనలకోసట్టే తగులఁ బెట్టవలెననుకొన్నావా యేమి? తిరిగి విఘ్నేశ్వరపూజకు బియ్యము—దక్షిణకు డబ్బులునా? చాలు—చాలు!

వెంక—ఈదైవప్రార్థన లౌకికమైనది. దీనికి బియ్యము డబ్బులు నక్కఱలేదు. శివయ్యశాస్త్రిగారూ! మీరు లేచి యారంభింపుదురు?

శివ—(లేచి) దైవప్రార్థన గావున నందఱు లేవవలయును.

సుబ్బి—అదిగో! పెద్దచిక్కు తిరిగి తెచ్చిపెట్టినావయ్యా? లేముటకు నాతరముగునని యనుకొనుచున్నావు కాబోలు? వెంకటప్పయ్యా! వద్దవద్దనుచుండఁగా నీకుర్చీలోనన్ను బుట్టలోఁ జిక్కకుండ లాగుచుఁ బడఁగొట్టినావు. ఇప్పుడు లేవవలెనట.. ఎట్లు?

కృష్ణ—శివయ్యశాస్త్రిలూ! రా! నీవు కుర్చీ క్రిందకదఁచి పట్టుకో! నేను వెంకటప్పయ్య, సెట్టిగారి చేతులుపట్టుకొని పైకి లేవఁదీయుదుము.

శివ—(కుర్చీయుడఁచి పట్టుకొనును)

వెంక<br>కృష్ణ } (సెట్టిచేతులు పట్టుకొని పైకిలాగుదురు.

కృష్ణ—ఊ. ఉ. శివయ్యశాస్త్రిలూ! కుర్చీ లేచుచున్నది. క్రిందకు గట్టిగా దబాయించు, ఊ. ఉ. అబ్బా! రాకుండ నున్నాడే!

సుబ్బి—లేగమోతికయునని యనుకొన్నావటోయి పంతులూ! ఊరంతి మనుష్యుఁడను. సుందరీ! నవ్వకె! వయసునాఁటి వాతము లోనికి దిగినప్పుడు నిన్నును నలుగురు పట్టి లేవఁదీయుదురులే!

కృష్ణ—ఊ. ఉ. అయ్యో! భట్టురాజులట్లు గొడ్డుపెట్టుకొని చూచెదరేల? లెండు! నడుము బిగించికొని రండు, అసలు సెట్టియాడిరానప్పుడు మీరయిన కుకవిత్వాలెవని కొఱకు?

సుబ్బి—అక్కడ లేదా. అక్కడ లేదు, కొంతమనుష్యునకు లేచినట్లు కనఁబడుటలేదా?

వెంక—పైనుండుటచేత నాకేమియుఁ గనఁబడుటలేదు.

కృష్ణ—శివయ్యశాస్త్రులూ! క్రింద ఖాళీయేమైన నైనదేమో చూడుడు.

శివ—ఆ. తగుమాత్రమైనది.

సుబ్బి—మొత్తఁగాఁటేసదింక పరవాలేదులే. ఇంకఁ జులకనగానే లేవఁగలను. ఇదిగో: ఊ–ఊ. (స్టేజి లేచును.)

కృష్ణ—అమ్మయ్యా! సభాసదులారా! ఒకవిన్నపము. కార్యక్రమము ననుసరించి దైవప్రార్థనముఁ జేయవలసియున్నది. కుర్చీలో స్టేజిగారదుకుకొని పోయినను సంగతి మీరెల్లరుఁ గన్నులారఁ జూచినదే. ఇప్పుడు దైవకటాక్షముచే కుర్చీకి కుర్చీ, స్టేజికి స్టేజి వేఱుగాఁ గనఁబడుచున్నాగు, ఇందుకొఱకు మఱియొక దైవప్రార్థనము సేయవలసియున్నది. సమస్తశుభములవలె నీశుభముగూడ దైవానుగ్రహమువలననే సిద్ధించినదైనను బుధప్రయత్నమును విరమింపఁ గూడదు. కావున వైశ్యరాజోద్ఘాటన విద్యాపద్యులగు వెంకటప్పయ్యగారిని శివయ్యశాస్త్రిలుగారిని మిగుల నభినందించుచున్నాను. (కరతాళధ్వనులు)

శివ—ఇదివఱకే మిగుల నాలస్యమైనది. ఇంక నుత్తరక్రియా దీక్ష వహింపవలసి యున్నది. (కరతాళధ్వనులు)

వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతఃపితరౌవందే పార్వతీపరమేశ్వరౌ.

[కరతాళధ్వనులు]

ఇది కార్యక్రమము ననుసరించిన దైవప్రార్థనము. శ్రీమంతులవారుపపాదించినట్లు మఱియొకసారి దైవప్రార్థనముఁ జేయవలసియున్నది.

శైవావయం నఖలుతత్ర విచారణీయం.

కంచాతురీ జపవరాసితరాంతథాపి.
చేతో మదీయ-మతసీకుసుమావభాసం,
స్మేరాననం స్మరతిగోపవధూకిశోరం.

[కరతాళధ్వనులు.]

వేంక — సెట్టిగారూ! మీరిఁక బల్లమీఁద గూరుచుండుఁడు.

సుబ్బి — ఈజన్మమునఁ కింక. గుర్చీమాట యెత్తకేమి? (బల్ల మీఁదఁ గూరుచుండును.)

వెంక — (కాగితము చూచి) రెండవది సెట్టిగారి గుణసంపత్తిని గూర్చి — కృష్ణారావు పంతులుగారు —

కృష్ణ — సుబ్బిసెట్టీ! సభాసదులారా! నేను వక్తనుగాని హేతువున నుపన్యాస మచ్చొత్తించితిని. ఈ కాగితములందఱకుఁ బంచి యిచ్చెదను. (ఇచ్చును)

సుబ్బి — (అపవారించి) వెంకటప్పయ్యా! అచ్చుకచ్చు పంతులదేగదా?

వెంక — (అపవారించి) ఔను. మనదికాదు.

సుబ్బి — ఇంకను వంద కాగితము లచ్చువేయించుకోసి,

కృష్ణ — హారిః ఓం. ఆంధ్రమహాజనులారా! వైశ్యజాతికివజ్ర కిరీటమెవరో, ఆంధ్రదేశమున కమూల్యాలంకార మెవరో, సమస్త వ్యాపారజ్ఞాననిక్షేపమెవరో, ఏకపత్నీవ్రతదీక్షాధురంధరులెవరో, గోవ బ్రాహ్మణభక్తి భరితాంతఃకరణులెవరో. గోరిజలగోత్రరాజపవిత్ర మూర్తి యెవరో యట్టిపసుసెట్టిగారి —

[నేపథ్యమున]

పసుసెట్టిగారన నేమి?

కృష్ణ — పచ్చిపులుసు సుబ్బిసెట్టిగారు-షష్టిపూర్తి మహోత్సవముకంటె నఖిలాంధ్రలోకమున కత్యంతానంద ప్రదాయకమైన

యంతము వేఱొకటిలేదని సొక్కి వక్కాణింపఁగలను. ముప్పదిసంవత్సరముల క్రింద నీతఁడు కేవలదరిద్రుఁడై యీగ్రామమునకువచ్చినాఁడు. చిన్నగుడిసెలోఁ బెసరపుణుఁకులవ్యాపార మారంభించినాఁడు. ఇట్టి యిట్టి చిన్నగుడిసె పెద్దమేడయైనది. పెసరపుణుఁకులు బంగారు కణికలైనవి. (కరతాళధ్వనులు)

సుబ్బి—చాలు చాలు కంతులూ! వాకొంకుఁదీసి—ఆదాయ పుబన్ను మఱింతకట్టించుట కాలోచింపుచున్నారా యేమి?

కృష్ణ—(చదువుచు) ఈతఁడు నాకు ప్రాణమిత్రుఁడు. ఎనిమిదిమాసములనుండి యీతఁడు నాకనేకావసరములందు దయాపూర్వకముగఁ జేయుచున్న సాహాయ్యమింతింతని చెప్పుట కలవిగాదు. ఆతనికి నేను సర్వదాకృతజ్ఞుఁడను.

సుబ్బి—అబ్బో! అబ్బో! ఈమాత్రమునకేనా యేమి యిచ్చినామో, రూపాయికొకఅణాపైసలు వడ్డీచొప్పునఁ దిరిగి పుచ్చుకొనినామో—ఇంతేకాదా మాయుపకారాలు—మీకృతజ్ఞతయును!

కృష్ణ—(చదువుచు) ఈతనికి "టీ" గాని, "కాఫీ" గాని, చుట్ట గాని నస్యముగాని యలవాటులేదు (కరతాళధ్వనులు.)

సుబ్బి—అందునకు డబ్బిచ్చువాఁడేడీ!

కృష్ణ—(చదువుచు) ఈతఁడొనర్చిన లోకోపకారక మహాకార్యము లనేకములున్నను, సంగ్రహాభిలాషచే రెండుమూఁడుమాత్రమే చెప్పెదను. ముప్పదినాల్గవయేఁట నితఁడు మూఁడువేలరూపాయల వరశుల్కమును గ్రహించి వివాహమును జేసికొన్నాఁడు.

సుబ్బి—వేపారిపంతులు వెక్కిరింపుపంతులని మొట్టమొదటనే చెప్పలేదా?

కృష్ణ—(చదువుచు) వైశ్యమహాజనసభ యీగ్రామమున నొకసారి సమావేశమైనప్పుడు నాల్గుదినములుకూడఁ బైగ్రామస్థులకుఁ

బాటీలఁడు సభవారి వంటశాలలోనే భోజనముచేసి మతాభిమానము ను దేశాభిమానమును భాషాభిమానము నాంధ్రలోకమున కంతకును వెల్లడించుకొన్నాఁడు

["వినుఁడు వినుఁడు" అని సభలోఁ గేకలు.]

సుబ్బి—అప్పుడు, ఆ పూట నాయుక్తిని మూఁడువేలజనులు భోజనము చేసెడివారు. నాయుగుశుభముల కంటఁబడిన మొదల నొకశుభ మింటఁ బడునని మాయయ్యగారు చెప్పినారు.

కృష్ణ—చదువుచు, కళత్రవియోగమైన తరువాత నేను వివాహములఁ బ్రయత్నించినను పిల్లనిచ్చుట కెవ్వరునంగీకరింపకపోవుట చేత వివాహవైరాగ్యమును బరిపూర్ణముగఁ బొందియున్నాఁడు—(కరతాళధ్వనులు, ఈతఁడుచేసిన దానములన్నియు వివరించుట కిటఁ దావుచాలదు, కొన్నిమాత్రమే చెప్పి విరమింతును. వైశ్యమహాజనసభవారికి సంతర్పణకొఱకు మూఁడుబండ్లవిస్తరాకులు, ఊరుగులమ్మవారి యుత్సవమునకు నూరుబుట్టిగుగ్గిలములు, మునసబుకరణములకు కలిపి నెనుగుబెల్లము—శ్రావణికి యజ్ఞోపవీతము లిచ్చిన శివయ్యశాస్త్రులుగారి కొక పావులా—గడ్డపాటిభాగవతులకు వత్సరమున కొఱగాడు—ఒడలికో తలవానికి రెండణాలు—ఈమహానుభావుని గౌరవార్థమై యీతఁడు వేఁకటప్పయ్యచేతను నాచేతను గ్రామస్థులందఱకుఁ జెప్పించిన షష్టిపూర్తిమహోత్సవముఁ జేయుట కెవ్వరునంగీకరింపలేదు. గావుననీమాత్రపుఁబని కొకనిసాహాయ్య మేలయని గ్రామస్థులకు సిగ్గువచ్చునట్లు—ఆంధ్రలోకమున కెల్లఁ దలవంపులగునట్లు—అహామస్మియని యీకర్మము ను స్వయముగాఁ జేసికొనుచున్నాఁడు. (కరతాళధ్వనులు) ఈమహానుభావునికి—ఈలోకోపకారపారీణునకు భగవంతుఁడు నిరోగదీర్ఘాయుష్యమిచ్చి రక్షించుఁగాక! ఓంశాంతి శ్శాంతిః (కరతాళధ్వనులు.)

సుబ్బి—వెంకటప్పయ్యా! అందఱిచేతులలో నుండు కాగితము

లనుదీసి గల్లాపెట్టెపైకెక్కియున్న బుట్టలోఁ జాగ్రత్త పఱుపుము. ధనియాల ని, యింగువయని, పొట్లములకు పైని కేయుము మోగించినను, మనకుఁగా వలయునా యేమి?

వెంక—(కాగితములన్నియుఁ దీసికొని) తరువాత—(నవ్వుచు) ఆశుకవిత్వము—రామస్తోత్రములను భట్టురాజులు.

సుబ్బి—మేజువాణియైన తరువాత వేళయున్నయెడల భట్టుకవిత్వము చూచుకొనవచ్చును,

రామ—సెట్టిగారూ! భట్రాజులను మమ్ము భోగమువాండ్ర క్రిందఁ బడవైచుట న్యాయము కాదు.

వెంక—అయ్యా! కార్యక్రమపత్రములో పైరి తరువాతనే మేజువాణియున్నది. ఆక్రమము తప్పుటయెందులకు?

సుబ్బి—మనకుఁ గ్రమమేమి? మర్యాదేమి? యుద్యోగస్థులమా మనకేమి యధికారాలా? మన సభలేమి రాజసభలా? కోమటివారికిఁ గ్రమమేమి? ముందువచ్చినవారికి సరకు వెనుకనిచ్చెదము; వెనుక వచ్చినవారికి సరకు ముందునిచ్చెదము. క్రిందిది మీఁదికి, మీఁదిది క్రిందకుఁ బెట్టకపోయినయెడల జరుగుబాటెలాగు? మనకేమి మళ్ళా, మాన్యాలా? పాతఁబియ్యము క్రొత్తవి యిచ్చెదము. తేననిందుకొన్న యెడల దానికి బదులు బెల్లపుఁ బాకము చెలామణీ చేయుదుము. ముక్కునకు సూటిగాఁ బోవుయెడల వ్యవహారాలు చేసినావే—

శివ—సెట్టీ! అట్లనరాదు. ఎవ్వరిసభయైనను సభగాని సంత కాదు. కార్యక్రమమును దెలుపు పత్రమును గౌరవింపఁదగును.

సుబ్బి—ఋణపత్రికే—తనఖాదస్తావేజులే—న్యాయసభలలో టువ్వున నెగిరిపోవుచున్నవి. ఇంక మావలవనే న్యాసయ్య వెంకటప్ప య్యంగీకరించిన పత్రము ప్రకారము నేనునడువవలయునా? నాకుమీకట్టు బాటేల? అదిగో! కంతులు ముసిముసినవ్వులునవ్వుచుఁ బెండ్లికొడుకు

వలెఁ గూరుచున్నాఁడు. నామనసువచ్చినవాఁడు. పంతులూ! మేజువాణి యారంభింపుమని చెప్పు.

కృష్ణ—సుందరీ! సెట్టిగారట్లు సెలవిచ్చుచుండఁగా నూరకుందువేల? రా.

సుంద—(మద్దెలకు నమస్కరించి సభలో నొక్కొక్కనికి నమస్కరించును)

వెంక—సెట్టిగారూ! సుందరి మీకు నమస్కరించుచున్నది.

సుబ్బి—ఆలాగా! అబ్బో! అబ్బో! మాకు దండాలే! లాభాలమీఁద లాభాలు! నూతేండ్లు వర్ధిల్లి, పదిసంసారుల కొంపలులాగిసి కొంపమీఁదఁబడవేసికో—ఒడలు మాత్రము బాగుగాఁ గాపాడుకో. వెఱ్ఱిముగమా! పుల్లిగింజకు పీలగింజకుధర మాత్రమెన్నఁడు రాఁదుసుమా! మీవ్యవహారాలలో నేమి. మావ్యవహారాలలో నేమి! చిల్లర శేరుపాలత్కి కాని పెద్ద పెద్ద బేరాలు కావు. పెద్ద కాతాలు వచ్చువఱకు నోరుదెఱచుకొని కూరుచుండిన యెడల వట్టిదంపుగ—ను కాణాము లోనికివచ్చిన బేరమెప్పుడుఁ జెడనాడుకోవద్దు. ఎంతసేపు మెత్తని మాటయేగాని రట్టుమాత్రము వద్దు. సూను. వినుకుదల మాత్రము పనికిరాదు. తెలిసినదా? ఇది వర్తకరహస్యము.

కృష్ణ—సెట్టీ! శిష్యురాలికి మంచిబుద్ధులే చెప్పుచున్నావు! అది గుణానురక్త కాని ధనానురక్త కాదు.

సుబ్బి—పంతులూ! నీకంటె నేను బెద్దవాఁడను. నీవుసుందరిని గొలఁది కాలమునుండియే యెఱుఁగుదువు. కాని యిది నామోకాలంత కున్నది యైనప్పటినుండియు నేనెఱుఁగుదును. పెద్దదైనతరువాతఁ జూపులు లేకపోయినవి. ఈగొడవకేమి సుందరీ! కానీ.

సుంద—తమ్ముఁడా తిత్తి పోయుము.

తిత్తిగాఁడు—ఊఁ. (పోయును)

మద్దెల—ఎక్కువయ్యెఁ ది. రవంత నుక్కు. అయ్యో! మిక్కిలి దిగిపోయినది.

సుబ్బి—చంటిపిల్ల యేకువలాగున నదిలేకపోయిననేమోయి?

సుంద—[శబ్దములకాలుపుశో భరతము చేయుచున్నది]

కృష్ణ—వహవ్వా. నీవు సెట్టిగారిపైని బాగుగా నభినయించి బహుమానముఁ గొనవలెను.

కీర్తన—హిందూస్థాని కాపీ—అది

స స పా మా గా రీ స ని పా రి గ రి సా సా ని ధ.

సుంద—కన్నారంగా, గాంచితి నిన్నుఁగఁగను

స స స స స స సా స గా గ గ గా మా గ మ పా

ముద ముదలో గంటిని రా॥ కన్నా॥

[అభినయించును]

స స స స సా స స రీ మ మ పా,

అగరును గంధముఁ బూయుదునా—

స ధ ని ధ పా గా ధ స స మ రి మా గ రి సా,

అత్తరు మేనికి రాయుదునా.

[అభినయించును]

సుబ్బి—మాకొట్టులో నత్తరువన్నీ రులమాటయు బద్ధము, ఆముదము కావలసినంతయున్నది. కమ్మని యాపునేయివంటియాముదము.

సుంద—అగరుగంధముఁబూయుదునా

అత్తరుమేనికి రాయుదునా

స స స సా స స రీ మ మ పా,

తగునని చెంతపై వేయుదునా

సుబ్బి—(అనవారించి) వెంకటప్పయ్యా! దగ్గరగానున్నావుగదా? ఊఁ

వెంక—[అవధరించి] ఉన్నాను. ఎందుకు?

సుబ్బి—ఎందుకులేక! నీకు బాగుగాఁ గనఁబడుటకుఁగాను దగ్గఱగానుండుమంటిని లే.

సుంద—తగునని చెంపపై వేయుదువా—అభినయించును]

కృష్ణ—వేయవేమి? కానీ!

సుబ్బి—[వెంకటప్పయ్యవంకఁజూచుచు] అబ్బో! అబ్బో! వంతులూ. సానితో సరసాలాడుచున్నావా? నీవు కరివేపాన కనుచున్నావని సుందరి యెఱుఁగకపోలేదు లే! ఇంతకు గోమటివారికుఱ్ఱవాఁడు లోకువ గదా యని—

కృష్ణ—ఓరి నీకుఱ్ఱతనము కూలిపోను!

సుంద—అగరుగంధముఁ బూయుదువా

అత్తరు మేనికి రాయుదువా

తగునని చెంపపై వేయుదువా—వా

పా ద సా ని ధ పా ని ధ ధ ద

గా గ గ గా మా గ మ పా

దర్పంబెంతో చూపుదువా॥ కన్నా॥

[అభినయించును]

కృష్ణ—శబాసుసుందరీ! మిక్కిలి యొయ్యారముగా నభినయించితివి!

సుబ్బి—అబ్బో! దర్పము చూపెదవేమి? ఎంతదానవైతివి! పుష్పరథములాగున నెంతదానవైతివి! చిన్నతనములో గూడకట్టు కట్టుకొని పుణుకులదుకాణములోనికివచ్చి "బావా! నాకొక్క పుణుకు పెట్టవు?" అన్న నిన్న గాక మొన్నటిదానవు! నులకమంచపుఁగోడంత యుండెడిదానవు—ఇప్పుడు నూకాలమ్మంత యైనావు. (తనలో) దీని మీఁద సుబలాటము నాకుమిక్కిలి మొగ్గుగాఁ గనఁబడుచున్నది. (అవవా

రించి) ఔ.కటక్పుయ్యా! చిన్న బాబుగారి దివాణములోవున్న లంగావర కులు తమలపాకులకని చెక్కలకనియనదుకాణములోనికిఁ దఱుచువచ్చు వారుగదా=వారిలో నెవ్వరికినింత యొయ్యారము-ఇంతఠీవి-ఇంతడాబు ఇంతడౌలు లేద సుమా!

వెంక—[అపవారించి] భరతవిద్యనేర్చిన యాటకత్తెయిది!

సుంద—జుట్టునఁ బూవులు ముడిచెదనా—నీ
సొగసునుజూచి మురిసెదనా
కొట్టు తాళమును దీయుదునా—పెద్ద
పెట్టెఁ దీసికొనిపోవుదునా॥ కన్నా॥

[అభినయించును]

సుబ్బి—అబ్బో! అబ్బో! పెట్టెలో భాగ్యాలు కవిలికట్టలు నలుక పెంటలును. ఇంతేకాదా? ఏమోయున్న వసి పెద్దవాడుక—వచ్చినదంతయు వడ్డీకే సరిపోవును. అసలులోఁ బెద్దలొట్టయే. ఎవరెఱుఁగని సంబరాలు!

శివ—శెట్టిగారూ! ఎందులకీ సర్దుబాటు? లేని యెడల నొకరిచ్చెదరా? ఉన్న యెడల నొకరుతీసికొందురా? ఎవరికున్నంత వారికున్నది.

సుం—చేయిఁబట్టుకొనిలాగుదునా—
చెచ్చెఱగదిలోకీడ్చెదనా
చీఱచెఱఁగుచేఁ గట్టుదునా—మఱి
చేతికి జిక్కఁగొట్టుదునా॥ కన్నా॥

(అభినయించును.)

సుబ్బి—అబ్బో! అబ్బో! ఇది యేమిసరసాలు! కొత్తసరసాలు వచ్చిపోయినవి! పంతులూ! ఈజబర్దస్తీసరసాలేమి? ఈజబ్బపుష్టి పాకాలేమి? ఈపిడిగుద్దులముద్దులేమి? అబ్బో! అబ్బో! ఎంతదానవు?

చెచ్చెఱగదిలోకీడ్చెదవా? ఏదీ యీడ్చు! ఏది కదుపు! ఆ! నీకంటికంత గుల్లసరుకులాగుననున్నాను కాఁబోలు? ఏదీ! ఇప్పుడేగదా—నీకంటియెదుటనేకదా—కుర్చీలోనుండి పైకిలాగుటకు నలుగురు బ్రాహ్మణులకుఁ జావు తెంపులయిపోయినవి!

కృష్ణ—సుందరీ! మఱియొక్కసారి యభినయింపుము, శివయ్య శాస్త్రులుగారు! ఇప్పుడు పట్టినహస్తమేది?

శివ—ఒక్కటేమాట. ఇప్పుడుపట్టినను స్వహస్తముగాని మఱియొకటి కాదు.

సుంద—చేయిఁబట్టుకొని లాగుదునా— [అభినయించును]

కృష్ణ—లాగు! లాగు! చూచెద వేమి?

సుంద—[సెట్టిచేయిఁబట్టుకొనిలాగుచు]

చేయిపట్టుకొనిలాగుదునా—[అభినయించును]

సుబ్బి—[అడ్డవారించి] వెంకటప్పయ్యా! దగ్గఱనున్నావుగదా? మీఁదఁ జేయివైచి మాత్రముండుసుమా! (తనలో) ఇది చేయిపట్టుకొని లాగఁగానే యొడలు జలదరించినది. (అడ్డవారించి) సుందరీ! నేనొడలుపట్టలేకుండనున్నాను. మేజువాణి యైనతరువాత నీవు మా యింటికి రావలెను, వెంకటప్పయ్యను దొడ్డిగుమ్మములోనుంతును. ఊరకే గనుక నా; నోటితో లేదనునది చేతితో లేదనిపింతును. తప్పకరావలెనుసుమా?

సుంద—ఊఁ—చేయిఁపట్టుకొనిలాగుదునా

చెచ్చెఱగదిలోకీడ్చెదనా

చీఱచెఱఁగుచేఁ గట్టుదునా—మఱి

చేతికఱ్ఱతోఁ గొట్టుదునా! కన్నా!

(అభినయించును)

కృష్ణ—(తనలో) కోమటిముండకొడుకు చేయి యడ్డుపెట్టు

కాని సుందరచెవిలో నేమియో యూదినాఁడు ఇది "ఊఁ" యనినది. కాని యేమియూ నెఱుఁగనట్లుయుండవలయును. (పరికాశముగా) ఇది గో! రెండురూపాయలు.

మద్దె—బళి కృష్ణరావువంతులుగారే బళి! సుందరికి సభలో రెండురూపాయలు తాంబూలపు ఖర్చుక్రింద దయ చేయించినారు, శ్రీకృష్ణార్పణము! (ఎగురుచున్నాఁడు.)

వెంక—ఇదిగో! ఒకటి.

మద్దె—బళి వెంకటప్పయ్యగారే బళి సుందరి సభలో నొకరూపాయ తాంబూలపుఖర్చుక్రింద దయచేయించినారు. కృష్ణార్పణము! (ఎగురుచున్నాఁడు.)

సుబ్బి—ఇఁక నందఱకుఁ దాంబూలము లిప్పింపుము.

రామ—మాకు నూరుపు విత్వమున్నదండీ!

సుబ్బి—వెంకటప్పయ్యా! ఇవి యేమోయి! ఈగోడవ తెచ్చిపెట్టినా వేమోయీ! మనకింట నొంట నెప్పుడు గవిత్వంపు గాడిదగత్తర లేదోయి!

వెంక—ఇప్పటి సభలలో నిది యొక యాచారముగానున్నది.

రామ—గీ. సరసుబ్బిసెట్టి ! సంతోషముగ నిన్నుఁ
జూడగల్గినాము ! చోద్యమమర
ఆశుకవిత మేము ! అవలీలఁ జెప్పంగ
సిద్ధమైతిమయ్య ! చెలువుమీఱ.

లక్ష్మ—క. భువనంబులో నెఱదాతలు
అవలీలగనున్నవారు అందఱుమీఱుఁ
బ్రవిమలముగ నీడొత్తురె
అవనిఁ శ్రీసుబ్బిశ్రేష్ఠి! అనఘచరిత్రా

రామ—క. శ్రేష్ఠి శ్రేష్ఠి యనుచును
శ్రేష్ఠముగాఁ బల్కువాము చెలువుగ, లలిఁ గో
మేష్ఠరువగు నువు సెట్లకు
సుష్ఠుగ శ్రీసుబ్బిగుప్త! సుకవులతృప్తా!

లక్ష్మ—క. కుమ్మరపాత్రసంబులలో
కుమ్మపాత్రయంబుగాగ సొరిదిం గవిలో
నిమ్మకవల చెప్పువారము
నిమ్మకవటము లిప్పింపుడు నిపుడే సుమ్మన్నా.

సుబ్బి—ఉండుఁడు! ఉండుఁడు! అయ్యో! నేర్చుకొనిపోయినా రలేంటు! మంచి సరసముగానే యున్నది. బుడబుడక్కలవానిలాగున నొకటే ధోరణి—చాలుచాలు నిక్కమాలినగోల—

వెంక—కవులారా! కొండరవడక సెట్టిగారు చెప్పిన దేదియో వినుఁడు! వినుఁడు!

రామ—క. అయ్యా వెంకటపయ్యా
వెయ్యాకులవంటి వాఁడ వయ్యా వహవా
సయ్యాటలేల వినుమీ
వియ్యాలలో దేవపెయ్యా! వెంకటపయ్యా!

సుబ్బి—(సంగీతములో) ఓరి మీగొంతుకులు గోయ్యా,

లక్ష్మ—క. మంత్రిదఁడన్ సెట్టికివర
తంత్రిని నీవఖలకొట్టు తంత్రంబులకున్
కంత్రీబుద్ధులు లేవిఁక
జంత్రపుడా కీలుబొమ్మ! సద్గుణదిమ్మా!

సుబ్బి—వెంకటప్పయ్యా! నీయిల్లుమూసిపోను. నాకొంపఁదీయుట కిదియేమోయి!

రామ—క. శాస్త్రిపుఙ్గవ బ్రాహ్మణు
లిట్రికవి చెప్పఁగలరె? యిలలలిసరవిన్
భట్రాజు మాంసకవితకె
యొట్రివపుచారుకవిత యీడొచ్చిలలోన్

శివ—ఇట్రియనఁగ నేమి? ఇట్రికవి చెప్పఁగలరె యంటిరి గదా!

రామ—రలయోరభేదః,—ఇట్లాయున్న మాట.

శివ—కవి చెప్పఁగలరే యని యంటిరిగదా—కవియనఁగాఁ గవిత్వమను నర్థమున్నదా?

రామ—గంగదాసు మహాకవి ప్రయోగమున్నది.

బండిరా పొగబండిరా దొరలుండు రైలుబండిరా.

మండలంబున గంగదాసువుండి యీకవి చెప్పెరా

శాస్త్రిలుగారూ!

గీ. ఆశుకవిత యొకటి యాప్రపేదయొకటి
స్వాయముగాగశుద్ధ చయముభువిని
వానికిలను వేఱు పరిశోధనముకూడ
దవనిఁ జెలఁగ వెలయు నమర భువిని.

శివ—వాదే బుద్ధిలోపము. మన్నింపవలయును.

లక్ష్మ—క. శుద్ధముగాఁ బండితులము
అద్దారాకవితలోన అతిగట్టిరముగ్
సద్దనముగూర్ప గట్టిగ
శ్రద్ధింతుము సభలజనులు శాబాసనఁగన్.

సుబ్బి—శాబాసందురో ఛీయందురో నేనెఱుఁగను. కాని యామాత్రింపుఁబని నేనును జేయఁగలను. కవిత్వమునకు మీరే సృష్ట్యాదిగురువులా యేమి?

చింతపండుదెచ్చి రాచిప్పలో వేసి
నీళ్ళుపోసి పచ్చిపులుసుచేసి
కాలినపంకాయ ఆపులుసులో వేసి
ఉల్లిపాయకార మందు వేసి
బుట్టలోదికాస్త దానిలోపల చేర్చి
బజ్జిజేసితినఁగ గజ్జెమొలచు—

ఓహో హో—ఓహోహో—ఓహోహో—(అని సంగీతము పాడుచున్నాఁడు) హే హే హే! ఈకవిత్వమునకంటె మీకవిత్వ మేమి యెక్కువ?

రామ—క. ఒకటా రెండా గడియకు
నికరముగా రెండునూర్లు నెఱిపద్యంబుల్
చకచకను జెప్పఁగలమిల
ప్రకటితముగఁ జొప్పడంగ బచ్చాధీశా!

లక్ష్మ—క. బచ్చుండవు నెఱదాతల
మచ్చుండవు శత్రువులకు మహితజ్వాలా
చిచ్చుండవు కవివర్యుల
మెచ్చుండవు మేటిసుగుణ పుట్టీ! సెట్టీ!

సుబ్బి—ఆఁగు! ఆఁగు! అంతటితో నాఁగు! చిన్నతనమునుండియు నదేయలవాటుగా దేవులాడినవారు కావున నన్ని యేని జెప్పెదరు. అందులకు మీకు బహుమాన మెందులకు? ఏది? వాళ్ళ మీరు లెక్కలు కట్టుఁడు! మూఁడురూపాయలు మూఁడణాలకుఁ బదకొండు కుంచాల మూడుతవ్వల మూఁడుగిద్దలు కందులైనయెడలఁ బదునాలుగణాల ముక్కాని కెన్ని? తెలివితేటలున్నఁ జెప్పుఁడు! నేనవలీలఁగఁ జెప్పఁగలను. లెక్కలలో నింతగట్టివాఁడనైన నాకూరి వారేమిబహుమానమిచ్చుచున్నారు.

కృష్ణ—సెట్టీ! మేము వెళ్ళెదము.

సుబ్బి—ఈబొమ్మజెముదు కంబలను నాజుట్టునకుఁ గట్టిపో వుదురా? దండాలు దండాలు. సుందరీ! నీవుకూడ వెళ్లు! ఇదిగో! ఊః శాస్త్రిలుగారూ! నడువుఁడు! (వారు నిష్క్రమింతురు.)

సుబ్బి—వెంకటప్పయ్యా! వీరిద్దఱకుఁ జెతియొక్క బేడ కాను కిచ్చి పొమ్మని చెప్పు. అబ్బ! అబ్బ! (లేచుచు) త్రాడుగట్టినమొదల లేచుట కింత చిక్కు లేదుగదా?

రామ—క. ఏఁడాలివ లేవో? గుడి
ఘోడాపై నివ్వ లేవో? కోమరుగఁదలఁచక
వోఁడెమ్మ చాకలికివలె
బేడాయిచ్చెదవు గేదె వేడా! ధరలోన్.

సుబ్బి—కట్టితే! వెంకటప్పయ్యా! కట్టితే! పోదు! మూలి మీఁదఁబోదు!

లక్ష్మి—క. ఉగ్రము బూనదవేలా
పోగ్రం కాగితములోన పారి జేర్చితవా
కుగ్రామవాస! మమ్ముల
నిగ్రహములములోక మోటుగ నీసిగదరగా!

సుబ్బి—అబ్బో మాకో పాలకు, మాశాపాలకు బెదరిపోవువా రెవ్వరు నిక్కడ లేరు. కత్తికోఁతల ముండకొంపు దుకాణములోఁ గూర్చుండి రొండలు కోసికొని యెంతగడబిడ చేసినను మూడేండ్ల వఱకుఁ గొత్త కాను చేతఁబెట్టలేదు. ఈనడుమ నేదో వారు వీరుఁ బట్టుపట్టుటచేత నిదియంతయు మనము కట్టుకొని పోవుదుమా యని బేడ బరాతము చేసినాను. వానితో సమముగా మిమ్మాదరించినప్పటికిఁ గూడ నింకనుఁ జాలదనుచున్నారా? పోండు! పోండు! ఇదియేమి కొండ్లియా? వసుగా? బుచ్చిబాబుగారి యింటిలో కొన్న బంచ

కట్టుత్సవమునకు మీ రేమిచ్చినారో తెలియకపోలేదు! మేము వెలమ
వారికంటె నెక్కువవారమా? పొంసు! పొండు!

రామ—క. అందఱికి నొక్కటిచ్చిన
పొందుగ భట్రాజులకును బోరి రెండీయన్
గ్రొందైన వాడుకున్నది
సుందరముగ లలిని వెలయు సొరిదిగ భువిలోన్.

సుబ్బి—ఆలాగే మీకును రెండిచ్చినాము కాదా? పొంసు. పొంసు.

లక్ష్మ—క. రెండిచ్చితి రెండిచ్చితి
మెండిచ్చితి పొండటంచు మేలంబేలా
కండూయమానదేవః!
మండూకమువంటి కంఠ మఱిమఱిసుంతా.

రామ—

ఉ. కోమటిసెట్టి! నేనిపుడు కోమలవైఖరిఁ జెప్పుచుంటినో
రాముఁడ నేను లక్ష్మణవిరాజితుఁ డీతఁడు నాకుఁదమ్ముఁడున్
ప్రేమమునూర వచ్చితిమి వేఁడుకదీరఁగ రెండురూక్యముల్
సామముగాగ నిచ్చి మరి సంతసపెట్టుధరాస్థలంబునన్.

లక్ష్మ—

శా. అన్నా! రెండని తల్కితేల యిలలో నన్నా! కవిశ్రేయసు పె
ద్దన్నా! ధారుణిబుద్ధిజాతికిని హైద్రాబాదు అక్కన్న మా
దన్నా! సద్గుణగున్న కీర్తిభరచెన్నా అన్న! భట్రాజురా
మన్నా! మాటలమిన్న! కోపమునసున్నా! యన్న! యెన్నాళ్ళకున్

రామ—శబాస్ తమ్ముఁడా!

ఉ. తమ్ముఁడ, నామసొమ్ముఁడవు, తప్పక సద్గుణకీర్తికాంత భా
రమ్ముఁడవాడు, రాంకవశిరమ్ముఁడవాడు, కవీంద్రకోటికో

రమ్మఁడవాఁడు; మూర్ఖుల కరమ్మఁడవాఁడు, స్వదేశసత్కవి
బ్రహ్మఁడవాఁడు, రెండనుచుబల్కితిమన్ననఁ జేయుతమ్ముఁడా!

సుబ్బి—మీగురాశుకవిత్వము సంతకుఁ బోవ ! విశాఖపట్టణ
ములో వెట్టియానుపత్రిలో నుండక మీరిక్కడికేలవచ్చితిరి ? పొండు.
పొండు. దిక్కుమాలిన గందరగోళము వచ్చినది. సాయిలవాని వేష
ములతో సిద్ధమైతిరా? పొండు.

వెంక—రామన్నా! లక్ష్మన్నా! నేను జెప్పినమాటవిని మీ
రూరకుండుఁడు. సెట్టిగారికి నిద్రవేళయైనది.

సుబ్బి—నాకీరాత్రి మిక్కిలి తొందరపనియున్నది. మీరు
నన్ను బాధించిన కార్యము లేశమును లేదు. వెంకటప్పయ్యా! చెటి
గయొక పావులా యిచ్చివేయుము. పొండు. పొండు! నేను బోవల
యును. గ్రంథాలుచేసి యమ్మకొందక యీతెలివిసంధికేకలు-ఈది
క్కుమాలిన కుక్క మొఱుఁగు ధోరణి—ఎందులకు? (పోబోవును)

ఉత్సాహవృత్తము.

లక్ష్మ—అన్నపోవువాఁడు యితఁడుఅట్టులడ్డు రమ్మికన్.
రామ—చిన్నవాఁడ అడ్డువచ్చి చెల్వమీర నుంటిరా!
లక్ష్మ—అ ప్లన్న పోవుచున్న అతసిమొలనుబట్టుకో.
రామ—పిన్నవాఁడవైననీవు పెద్దవాఁడు బుద్ధికిన్.

సుబ్బి—మీయాగడము మండిపోను. నన్ను లోపలికి వెళ్ళ
నీయరాదేమి ? నాయింటిలో నన్నుఁ బండుకొననీయరాదేమి?
అదిగో. అడ్డువచ్చుచున్నారు. ఈచిన్న ముండకొడుకు నాకాళ్ళసం
దున దూరిపోవునట్లున్నాఁడు. వెంకటప్పయ్యా! కఱ్ఱతీసికొనికొట్టు!
మీఁదఁబడిన యెడల నలిగి చచ్చును. జాగ్రత్త,చూచెదవేమి? కొట్టు.

ఉత్సాహవృత్తము.

లక్ష్మ—నీకుకఱ్ఱయున్న మాకు నెమ్మిగంటముండదే.

రామ—పోకుపోకుసెట్టినీవు పోకు పోకు పోకుమీా.

లత్మి—నీకుకట్టియున్న మాకు నెమ్మిగంటమిుండదే.

రామ—పోకుపోకుసెట్టినీవు పోకు పోకు పోకుమీా.

వెంక—(అవధారించి) రామన్నా! లత్మన్నా! నేను మిమ్ము సంతోషపెట్టెదను. అతఁడెటుఁగకుండఁ గాగితములో మీాపేళ్ళు చేర్చితిని.

సుబ్బి—ఎలాగో యొకలాగున వారికిప్పింపుము?

వెంక—చిత్తమాయాటయే చెప్పుచున్నాను.

సుబ్బి—ఊఁ. త్వరగఁ బంపివేయుము?

వెంక—వీరన్నట్లు చెటియొక రూపాయ నిచ్చెదను.

లత్మి—భత్యముమాట?

క. అయ్యా! భత్యంబియరా
 కొయ్యా గోతంబ కడుపు కొరకొరలాడున్.

వెంక—ఉండుఁడు! ఉండుఁడు! ఇంకమాటాడకుఁడు, పైకిఁ బొండు (ఇద్దఱకుఁ జెటియొకరూపాయ యిచ్చివారిని బలాత్కారమునఁ బైకి దీసికొనిపోయి తిరిగి ప్రవేశించును.)

సుబ్బి—ఇదిగో! వెంకటప్పయ్యా! ఇదిగో! కవిగాని నెప్పుడుఁ గొంపకుఁ దీసికొని రానని యొట్టు బెట్టుకో! సిగ్గు వచ్చినదా? ఇదిగో! నీవు దొడ్డిగుమ్మమువద్ద నటునిటుఁ దిరుగుచుఁ గొంత సేపుండుము.

వెంక—ఎందుకు?

సుబ్బి—సుందరి వచ్చెదనని చెప్పినదిలే!

వెంక—ఇప్పుడెందులకు?

సుబ్బి—సంభావన నాయొద్దనుండి స్వయముగాఁ బుచ్చుకొనునఁట.

వెంక—అందులకుఁ దెల్లవాఱిన పిమ్మట రాఁగూడదా ?

సుబ్బి— వెంకటప్పయ్యా! నీయొద్ద రహస్యమేమున్నది. ఈ రాత్రి యొందుచేతనో దానిమీఁద బుద్ధిపోయినది. శక్తి లేదని యెఱుఁగుదును. వాంఛ ప్రబలముగా నున్నది. దానిని రమ్మని చెప్పితిని; ఊఁ అన్నది.

వెంక—ఆ వేపారివాఁ డసాధ్యుఁడు!

సుబ్బి—ఏమయినను సరియే; కానినాబుద్ధి వెనుకాడునట్లు లేదు.

వెంక—మీకంత పట్టుదలగా నున్న యెడల మీయిష్టము.

సుబ్బి—అదే, నీవాగుమ్మమువద్ద నటునిటు దిరుగుచుండుము! అది రాగానే నాకుఁ జెప్పి నీవింటికిఁ బొమ్ము. ఇంతలో నేను రవంత శ్రమ తీర్చుకొని వచ్చెదను.

వెంక—చిత్తము.

సుబ్బి—వేపారిని వదలి సుందరి వచ్చునో రాదోయని యాందోళనముతో నున్నాను.

[ఇద్దఱు నిష్క్రమింతురు.]

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# కంఠాభరణము.

## తృతీయాంకము.

ప్రదేశము—సెట్టియింటిసమీపమున వీధి

[ప్రవేశము— కృష్ణరావు, సుందరి]

కృష్ణ—అలాగునఁగాదు-మునుపు నీవింత సొగసుగా నటించియుంటలేదు. ఓ! ఏమి రాకడలు! ఏమికల్పనలు! కోమటివానిని కంఠపై నొక్కటి యీడ్చివేయలేకపోయినావా?

సుంద—అంతపని కావఁగలఁడా? చేయిపట్టుకొంటినా, దడదడలాడిపోయినాఁడు. ముచ్చెమటలు పట్టినవి.

కృష్ణ—అప్పుడు నీచెవిలో వాతఁడు చెప్పినదేమి?

సుంద—ఆఁ! నీకెట్లు తెలిసెను?

కృష్ణ—కోమటిరహస్యాలాఁగునా?

సుంద—నిజముగా నీకు వినఁబడినదేమో చెప్పు! అసత్యమాడిన యెడల నన్ను జంపుకొనినట్లే.

కృష్ణ—నాకు వినఁబడలేదులే,

సుంద—(తనలో) ఇతనిని గొంతసేపేడిపింతును (ప్రకాశముగా) నాకీరాత్రి కోమటయ్య బోణీ-లాభాలమీఁద లాభాలు.

కృష్ణ—నిన్నాతఁడు రమ్మనెనా? నీ వాతని యింటికిఁబోయెదవా?

సుంద—పోక మానుదునా?

కృష్ణ—ఆ! నిజముగానే?

సుంద—సంసారస్థితి నీవెఱుఁగని దేమున్నది? బట్టలిచ్చిన యాతఁడు సొమ్ముకొఱకుఁ జంపుచున్నాఁడు. నీమాను యవక తవక చేత నీకు ఋణమైనఁ బుట్టకుండ నున్నది. ఏమిచేయఁ గంటివి?

కృష్ణ—ఉల్లిపాయ నమ్ముకొనువారియొద్దకుఁ బోయెదవా?

సుంద—ఊళ్లేలినవాఁడు మాకెక్కువ లేదు; ఉల్లిపాయవాఁడు తక్కువ లేఁడు. పైన మొఁడెక్కువ యిచ్చిన వాఁడే మాకుఁ బ్రియుఁడు.

కృష్ణ—ఈదిక్కుమాలిన చదువులింకఁ గట్టిపెట్టి యొక్కటే మాట చెప్పుము? నీవు కోమటియింటికి వెళ్ళెదవా?

సుంద—(తనలో) ఈజన్మమునఁగాదు. (ప్రకాశముగా) వెళ్లకపోవుట యేల? నేను బోకపోయినను వాఁ డెవ్వరినైనఁ బంపి పిలిపించుకొనును.

కృష్ణ—అటులైన నేఁడ్డుకొందును.

[శ్రీనివాసరావు మహమ్మదీయ వేషమునఁ బ్రవేశించి వేపారిని గట్టిగఁ గొట్టును. అతఁడు క్రిందఁబడిపోవును. వేశ్యను బలాత్కారముగ నోటిపైఁ జేయివైచి తీసికొని పోవును.]

కృష్ణ—(లేచి) అమ్మ! అమ్మ! నడుము విఱిగినది, కాలు తెటికిలఁబడినది. అయ్యయ్యో; కోమటివాఁడెంత పనిజేసినాఁడు! ఆహాహా! తనతురక భటునిబంపి నన్నుఁ గొట్టించి సుందరిని దనయొద్దకుఁ దప్పించుకొనినాఁడా! వీనికెప్పుడిట్టి యోగాలములేదు. అయువది యేండ్ల ముసలిముండకొడుకు వీని మొగము మండ! వీనికెంత దుర్బుద్ధియో! కూరుచుండిన లేవలేఁడు, లేచినఁ గూరుచుండలేఁడు. అట్టి చచ్చునిర్భాగ్యునకు సాని యొందులకో! ఆహా! వానివసనేల ఉన్న మాన్యములన్నియు వ్రాసియిచ్చితినే? ఆకాగితమింక స్థిరపడలేదులే. కాని యేమగునో చూతము. దానికొఱకిల్లంతయు నొడలంతయు గుల్లచేసి కొంటినే! సదా దానిని సేవించి తిరుగుచుంటినే!

అట్టి నన్నే యిట్లు గొంతుకోసినది. ఛీ! దానిననవలసినపనియు లేదు. దానివృత్తి యది. నేనెందఱసానులకు మోసపుచ్చలేదు! ఇతరుల స్వాధీనతలోనున్న యెందఱ కామినులను జిత్రచిత్రకల్పనలచే రప్పింపలేదు. అటులే కోమటి తనకిష్టముండిన యెడల సుందరిని బిలిపించుకొనవలసినది గాని నన్నుఁ గొట్టింపనేల? అందులోఁ దురకవానిచేఁ గొట్టించునా? కావున నీకోమటికిఁదగిన ప్రాయశ్చిత్త మొనర్తును. చచ్చినట్లు తిరుగఁగొట్టుదును. ఈకోమటివ నియింటివీధిగుమ్మములోఁ దురకభటుఁడు కాపుండునేమో? ఉన్న నేమి! నేను దృఢశరీరుఁడను. ప్రమాదమున నుండఁగా వాతఁడు గుద్దిపోయినాఁ-కనులుచీకటులుగ్రమ్ముటచేఁ బడిపోయితిని. తురకవానితో నైనఁ గలియఁబడుదును. ఏమైననగును (నడువఁబోవుచు) అయ్యయ్యో! నిలువఁబడినప్పుడంత బాధగలేదుకాని నడచునప్పుడు నడుము కలుకుమనుచున్నది. అబ్బా! ఒకనిమున మచ్చట విశ్రమించి పోవుదును. ఆహా! మాధ్వమతస్థుఁడను మహామ్మదీయతాడితుఁడనైతినే! వానిననవలసినదేమి? ఓసిదుర్భాగ్యంపుముండా!

[నిష్క్రమించుఁగ వెనుక దెర నెత్తఁగ సుబ్బలక్ష్మిప్రవేశించును.]

సుబ్బ—(మేలుముసుఁగుతో) ఆహా! గ్రామమంతట నల్లలాడుచుంటిని. అక్కడ కనఁబడలేదు. కాళ్లు లాగుచున్నవి. నిద్దుర వచ్చుచున్నది. ఇఁక నడువఁ జాలకుండ నున్నాను. ఈ యిల్లెవరిదో సంపన్నులదివలె నున్నది. ప్రక్కతలుపుగూడఁ దీసియున్నవి. లోనికిఁ బోయి రవంత విశ్రమింతును, ఏడుకొండలభగవానుఁడా! వెంకటప్పయ్యా! రక్షింపు!

[వెంకటప్పయ్య-ప్రవేశించును]

వెంక—మేలుముసుఁగువైచుకొని లోనికెవ్వరో వచ్చినారు. తప్పక సుందరియే యగును. ఆప్రక్కనుండిపోయి సెట్టిగారితో నీశుభవార్త చెప్పి యింటికిఁ బోవుదును. (నిష్క్రమించును.)

సుబ్బ—ఏమి యీవిచిత్రము! వదలక వదలక సర్కసుకొఱకి ల్లువదలుటయేమి! ఈమహావిచిత్రనాటకమేమి! అంతయు మాయగాఁ గానఁబడుచున్నది. కన్నులయెదుటి యక్కయిట్టే మాయమైనది. మా వికత్తున కాపిచ్చిముండకొడుకే కారణము. ఈబల్లపై నొక్క నిముసము కండుకొందును. కండుకొనిన మొదల నేమిప్రమాదమగునో! వీధులలోఁ దిరుగుచుస్థితికంటె నిది కొంత మెఱుగుగదా! కానిమ్ము, భగవంతుఁడా! ఏమిచేయఁదలఁచితివో!

[సుబ్బిసెట్టి ప్రవేశించును.)

సుబ్బి—(తనలో)ప్రక్కతలుపులోన గొండ్లెము లేను కాఁబోలు! వేసెదను. అబ్బో! అబ్బో! సాహులు వేంచేసినారు కాఁబోలు—! సుబ్బిసెట్టిగారితో సరసాలకు! బాపనయ్యల సరసాలెక్కువో, మటయ్య సరసాలెక్కువో యిప్పుడు బోధపడును. ఇప్పుడస్తినిబ్బట్టును. బఁగారముకోకతో రాలేనట్లున్నదేమి ? అబ్బా ! అబ్బా ! చలిచేతఁగాఁబోలు! పచ్చడము కప్పుకొనియున్నది. అబ్బో! అబ్బో! ముగమైనను గనఁబడకుండ నీసిగ్గెందులకు? సభలో నాట్యమాడి చేయిపట్టుకొని లాగి చెంపకాయకొట్టుటకు సిద్ధమై-తీర సరసాలకు వచ్చునప్పుడు బిడియాలు కాఁబోలు! వెంకటప్పయ్య మదనకామరాజుకథలలోఁ జదివిన ప్రియకలహాలఁటఁగానివే కాఁబోలు! పోనీ! నాకును బ్రణయకలహము వచ్చినది. నేనును మాటలాడను. నేను ముసుఁగు వేసికొందును. బిఱ్ఱబిగిసి యీలాగునఁ గూర్చుందును. ఎవరిపంతము నెగ్గునో చూతము! నామట్టునకు నేను-అఱువదియేండ్లవాఁడను-దండకడియము పెట్టుకొని భుజబంధముకట్టుకొని, మెడలో గంతమాల వేసికొని, చలిగా నున్నను గంధముఁ బూసికొని, చిన్నబుడ్డిలోనిది పూతికపుల్లతో రవంత బట్టకొంగునకు రాచికొని, తనకీయవలసిన ముడుపేదో చెంగునమూటగట్టుకొని, నడుములాగకుండ నల్లమందు పిసరు వేసికొని, తాంబూ

లము చేతఁబట్టుకొని సిద్ధమైతినిగదా ! తానుబసుచుది—లాభాలుగాక-అసలుఋవదివరాలవిలువచేయు బనారసుకోకను విడచి మునుక గుడ్డ కట్టుకొని ముదుకదుప్పటి ముసుఁగువేసికొని రానేల ? చీరను బట్టియే సింగారము, మఱియేమైనమున్నదా ? సీమాయినుపరేకు డబ్బిలోనిదైనయెడల నారతికర్పూరము-చిన్నగాజుబుడ్డిలోనిదైనయెడలఁ బచ్చకర్పూరము-జన్మానికొల్ల నొక్క శివరాత్రియున్నట్టు-ఆఱువదులు దాఁటిన తరువాతనొక్కసారి పైసరసపుఁ బసందేదో చూడవలయునని గంపంత యాశపెట్టుకొని గర్భాధానపుఁబెండ్లికొడుకువలె నేను ముసిముసులాడుచు, గమగమలాడుచుసిద్ధమైనప్పుడు—తాను ముసుగువైచుకొని పూర్వసువాసినిలాగు సిద్ధమై పట్టెమంచ మూలనొక్కనుండఁగా బల్లమీఁదఁగూలఁబడి పళ్లుబిగ్గబట్టుకొని కూరుచుండునా? నే నంతకంటె బిఱ్ఱబిగిసి యుందును.

సుబ్బ—(తనలో) ఈతఁడు కోమటియైనట్లు స్వరూపము చెప్పుచున్నది, (ప్రకాశముగా) సెట్టిగారూ !

సుబ్బి—(తనలో) రా! ఆలాగున దానిలోకి రా! వేశ్యబింకాలు వైశ్యునియొద్దనా? మీకు వీత్వమేగాని నూఱుక్రింద నైత్వము కూడ నున్నది. ఇంకొకసారి పిలిచినఁగాని మాటలాడను.

(బిగిసి కూరుచుండును.)

సుబ్బ—అయ్యా! సెట్టిగారూ!

సుబ్బి—ఆ! ఎందుకు

సుబ్బ—కొన్ని కారణములచేత నిచ్చటకు నేను రవంతసేపు శయనించుటకు వచ్చితిని నీవు యోగ్యుఁడవని, సంపన్నగృహస్థుఁడవని విశ్వసించి వచ్చితిని. ఇదివఱకెప్పు డిల్లు దాఁటినదానను గాను. నీకిష్టమైన యెడల నుందును, లేనియెడల నిప్పుడే పోవుదును.

సుబ్బి—నాకిష్టము కాకపోవుటయేమి ? రవంతసేపన్నమాట

యేమి? నీకిష్టమగు నెడలఁ దెల్లవాఱినదాఁక శయనింపవచ్చును. (తనలో) ఆలోఁతుమాట నేననుట యెందులకు? దాని నోటివెంట నే యనిపింతును. సెట్టిగారి యెదుటఁ దనకీ బెట్టుసరి యేమి? కొన్ని కారణములచేత సిచ్చుటకు వచ్చినదఁట! ఆ కారణములు నాయొద్ద దాఁచటికమా? నరసుఁడు సన్యాసియైనాఁడు—వేపారి వెఱ్ఱిముండకొడుకువలన సంసారము గడవదని వచ్చినది, మాకీ పంతులాయనందలీయవలయును. తెల్లవారకుండ భటునిచేఁ బంపింతునని చెప్పినాఁడు. అతని మొగము! అతఁడిచ్చిన దేమి—నేను పుచ్చుకొనున దేమి? నేనేమో దీనికి విశేషముగాఁ బెట్టుదునని యాశ యున్నది కాఁబోలు! నాయొద్ద మాత్రమేమున్నది! ఉన్నది. లేదు—అసంగతి తన కెందులకు? ఏదో తోఁచినంత మట్టుఁ జెప్పెదను. అయినను నేను మాత్రము లోనుగు లోనుగుపోయి నన్ను ముద్దు పెట్టుకోవే! నామీఁదఁ జేయి వేయవే! ముందునుండి కౌఁగిలించుకొనుటకుఁ గనుపడ్డమైన యెడల వెనుక నుండి కౌఁగిలించుకొనవే! బోదకాలు మాత్రము కొకకంటఁ గనిపెట్టవే, గాని సరసపుమాటలు మాత్రమే నేనను. మొదటి తొందర నను సరించి యనవలసిన దేకాని మాబనారసు కోక లేకపోవుటచేతనే బుద్ధి యటు యటు వెనుకకు లాఁగినది, ఏమున్నది! జాతిగాదేనివైన రాజనాలు—పేడగాదేనివైనఁ బెద్దవరి. దినుసంతయు నొకటి—ఫలమంతయు నొకటి—ఏదో బేరము కొంత కదలినదిగదా! అదిగాక—నేనే ముందు తొందరపడిన యెడల ముదు పెక్కువయగును. కావున వెఱ్ఱిముండ కొడుకువలె బిఱ్ఱబిగిసి కూరుచుండెదను. (అట్లుకూరుచుండును,)

[వెఱ్ఱిరామశాస్త్రి వీథిలోఁ బ్రవేశించును.]

రామ—జ్ఞానికి దేహమునందు మిథ్యాబుద్ధి కలిగినను దేహాపోషణార్థమై అనాదిసంపాదనమునందు వానికిఁ గేవల ప్రారబ్ధము వలనఁ

ప్రవృత్తి సంభవించును. తెలిసినదా లేదా? ఉ. వానరులే నరజాతికి మూలపురుషులగునప్పుడు జగత్తంతయు నొక్కసారి యుద్భూతమైన దను వాదము పూర్వోక్తమైనదా లేదా? పూర్వపుశాస్త్రములన్నియు నూటికొకటి—కోటికొకటి, వసిష్ఠుఁడు, సనత్సుజాతుఁడు, వాలఖిల్యుఁడు నను నీమూర్తిత్రయము మూలఁగూర్చుండి ప్రకృతిమాయలాడికిఁ దిరుగలోనై పదునెనిమిది యధ్యాయములుఁగల భగవద్గీతనిరువదియాఱ ధ్యాయములు గలదానిగా సొంతకవిత్వము కలిపి ధ్వస్తము చేసినారు. ఔచిత్యము విడిచి కవులు కవులు తిట్టులాడి దెబ్బలాడి, న్యాయసభల కెక్కుటకు సిద్ధపడినప్పుడు—సరస్వతి యేడ్చినదఁగా నాశ్చర్యమేమి యుద్ధసిద్ధికై కొంతసొమ్మాయువలసి సర్కారుపత్రము పట్టుకొని తిరుగుచున్నాను. ఇదే ప్రవృత్తిలో, నివృత్తి; వాటికిపుఁ వాకయొద్ద మూరలేదు—సెట్టీ! సెట్టీ!

సుబ్బి—(లోపలనుండి) ఎవరు వారు!

రామ—పంతులుగారు సొమ్ముకొఱకు నోటుపంపినారు.

సుబ్బి—వేపారియాయనే? ఆఱువందలరూపాయలనోటేనా? (తనలో) ఇప్పుడు పుచ్చుకొనకుండిన వీనియొద్దనుండి సొమ్ము తిరుగ రాదు (ప్రకాశముగా) ఉండు! తలుపుఁదీయుచున్నాను! (తలుపుసగముఁదీసి చేయిచాపును.)

రామ—ఇదిగో! (ఒకచీటినిచ్చును.) ముట్టినదికదా!

సుబ్బి—ఇది నోటుగాదు. పంతులుపేరున్న చీటి.

రామ—ఛీ! సొమ్మిచ్చినట్లు రసీదు తే!

సుబ్బి—(కోపముతోఁ దలుపుదీసికొని యీవలకు వచ్చి) సొమ్మియ్యనదే రసీదా?

రామ—దులుఁపు! చింతపండుబుట్ట దులుఁపు! (కోమటిని గొట్టి లోనికిఁబోయి తలుపు వైచికొనును.)

సుబ్బి—అయ్యల్లో! ఓరయ్యల్లో! కాళ్ళులటలటలాడెనయ్యల్లో! గుండె దడదడ లాడినది. కన్నులు చీఁకటులు పడినవి! అయ్యల్లో! (తలపుఁగొట్టుచు) అయ్యల్లో! (తనలో) ఇనుపపెట్టె పక్కయింటిలో నున్నది. భయమేమియు లేదు. లోపల నెవరురో! అయ్యల్లో! (పిమ్మట ముగా) ఓసీ! సుందరి! సుందరీ! లోపల నెవఁడో దూరినాడు. దొంగ ముండకొడుకేమో! జాగ్రత్త! సుందరీ! ముసుఁగు పైకి దీయుదువా? ముడిచిపెట్టుకొని పండుకొనుదువా? అయ్యో! దానికిఁ బెట్టవలయునట పెసరపుణుఁగులు. తాటితాండ్ర మూటగట్టుకొని వచ్చినాను. వెఱ్ఱిబిం కాలు పెట్టుకొని దానిముక్కుమధ్దెనఁ బెట్టుకొనలేకపోయినాను. నాయెండ్లు నట్టేటఁగలిసిపోను! అయ్యో! అయ్యో! బేరమై—సిసలై—సిద్ధమై—కొట్టునకుఁ జేరిన సరకు చేయిదాటిపోయినది. సరకన్నా సరకా! పొల్లు, దూళి, దూగరయున్న మాట లేదే! పట్టినిక్కరపుసరకు' నిక్షేపమువంటి దినుసు! అయ్యయ్యో! ఇల్లుదూరిన ముండకొడుకెవ్వఁడో బోధపడదు! ఆముండకొడుకెవఁడో నన్ను వీథిలోనికిఁ గెంటునరికి నడుము విరిగినది. బుద్ధిచెదరినది. కాళ్ళుచల్లఁబడినవి. కన్నులు పచ్చబడినవి. నాకొంపదీయుటకు వేపారిముండకొడుకే యిల్లుదూరినాఁడా యేమి?

కృష్ణ—(ప్రవేశించి) నీగొంతుఁగొయ్య! నీపొట్టబ్రద్దలుగాను! నన్ను సిభటుఁడగు తురక చేతిఁ గొట్టించి నాసానిని విడ్పించుకొనిపోవుదువా! దొంగముండకొడుకా! సానిని గనఁబఱచని యెడలఁ జంపుదును.

సుబ్బి—పంతులూ! చూడు! తొందరపడెద వెందులకు! నిమ్మళించు! శాంతించు! ఇదిగో! రవంత తాటితాండ్ర కావలెనా? సరి క్రొత్తసరకు చూడు పంతులూ! బాకిసగూర్చి నిన్నెప్పుడైనఁ దొందర సేసితినా? ఏదో మనకు మనకుఁ గాతాజరుగుచున్నది—వెళ్లనీ? ఈలాగే వెళ్ళనీ?

కృష్ణ—నాసాని యెచ్చటనున్నదో చెప్పెదవా? తన్ననా?

సుబ్బి—నీవు తన్నుదువుగాని లే. ఈకాలికి విశాఖపట్టణపు భాగ్యాలుగదా? ఈకాలిమీఁద నారికురుపుగదా! నీవు తన్నినప్పుడు నేనుకూడఁ తిరిగి తన్నినప్పుడే సొగసున్నదిగాని యూరకుండినందువలన విశేషమేమున్నది? నీయేడణాలు నాచేతిలోఁ బడినప్పుడు నాయెత్తైను బెల్లము నీచేతిలోఁ బసును. సరకు తిరుగుచున్నఁగాని వ్యాపారానికి సులువేది?

కృష్ణ—నేననుమాటలను నీవు పరిహాసముగా గణించుచున్నావు. జాగ్రత్త. నన్ను తురకవానిచేఁ గొట్టింతువా? నాసాని నపహరింతువా? గడ్డిబొద్దుముండకొడుక!

సుబ్బి—తురకవాఁడేమి! సానియేమి! గడ్డిబొగ్దేమి! సందర్భము లేకుండ మాటలాడుచున్నావేమి? గవలగంగమ్మగారిహాస్తోదకమేమైనఁ దగిలినదా యేమి?

కృష్ణ—ఓరీ! నీనాలుకఁగోయ! నేనే త్రాగితినఁటరా? చావు చావు! (గుద్దును)

సుబ్బి—ఉండు! ఉండవయ్యా! ఈతొందర యేమి! ఈగడబిడ యెందుకు! అయ్యో! ఒక్కటే గొడవ! ఈనడువీధిలో నీయల్లరియేమి! పంతులూ! నిమ్మళము; చూడు! కావలసియున్నయెడలఁ బదిరూపాయలు పట్టుకొనిపోరాదా? పదిగాకపోయినయెడలఁ బదునాలుగా యెను. నీయవసరానికి చేసీయకపోయినదెప్పుడు?

కృష్ణ—ఓరీ గాడిదా! నాసానిని నీపక్కలో వేసికొంటివా? నేనునోరుమూసికొనుటకై నాచేఁ బదిరూపాయలు పెట్టెదవా? నేనుదార్పుడు కాఁడననుకొంటివా? కొట్టు. కొట్టు. (గుద్దును)

సుబ్బి—అబ్బ! అబ్బ! గట్టిగాఁగొట్టకు పంతులూ! కోటునలిగిపోవును. ఇదినాముహూర్తమునకుఁ కుట్టించుకొంటిని. ఏదీ! నాఁటికి నేఁడు!

కృష్ణ—నీకుఁ దిరుగ నేఁడు ముహూర్తమా! సానిసరసానికేనా యీపట్టుకోటు సింగారించితివి! ఈకంఠమాల పెట్టితివి? నాసాని యెచ్చటనున్నదో చెప్పు. లేనియెడల డొక్కచీల్చెదను.

సుబ్బి—ఉండవయ్యా! ఉండవయ్యా! ఒక్కటేకొందర ఏదైనా దిరకాసు వచ్చినయెడల మనలోమనము వ్యవహారము సర్దుబాటుఁ జేసుకోవచ్చుననఁగా—ఒక్కటే గోల! అయ్యా! సానిసానియని యరిసి గొంతు చింపుకొందువు. సాని నేమి నమలివేయుదురా? మ్రింగివేయుదురా? దొడ్డసానిని సంపాదించినావు! అయ్యో; ఊరుదాటిపారిపోవుదునను కొన్నావేమి? ఎక్కడనో యొకచోట నుండక మాయమగునను కొంటివా యేమి?

కృష్ణ—అది యెచ్చటనున్నది? మీయింటిలో దాఁచితివా? చెప్పు. చెప్పు. (కొట్టును).

సుబ్బి—వీపుమీఁదఁ గొట్టకు మామ! యీతుంటిమీఁదఁ గొట్టినయెడల దామరకురదయు దీరును, నీసరదయుఁ దీరును.

కృష్ణ—పోఁకంతముండకొడుకవు గాన దెబ్బ నీకు బ్రహ్మరంధ్రమున కంటలేదు (రెండుచెవులు పట్టుకొనును) చెప్పు. చెప్పు. నా సాని నీయింటిలో నున్నదా?

సుబ్బి—అయ్యల్లో! ఓరయ్యల్లో! వదలు వదలు వదలుమనఁగాను! అయ్యో! అయ్యో! ఎక్కడనో మోటుసరసాలు, ముక్కుమొగమెఱుఁగని వానిలాగున!

కృష్ణ—చెప్పువఱకు వదలను. (గట్టిగలాగును)

సుబ్బి—అయ్యల్లో! అయ్యల్లో! ఉన్నది బాబు. ఉన్నది బాబు.

కృష్ణ—తురకయే దానిని దీసికొనివచ్చినాఁడా?

సుబ్బి—ఇఁక వదలుము. కావలసినముచ్చట యేదోయయినది కాదా? పూసగ్రుచ్చిన ట్లన్నియుఁ జెప్పెదనువదలు. నన్నుఁగొట్టగలిగితివి కాని—వెంకటప్పయ్యనుగాలు—సాగఁదీసి వదలిపెట్టును.

కృష్ణ—సరే వదలితిని చెప్పుము.

సుబ్బి—తురకమాట నేనెఱుఁగను. సానిని రమ్మని నేను గోరితిని. దానిని వెంకటప్పయ్య లోనికిఁ దెచ్చినాఁడు.

కృష్ణ—ఈసమయానికి నీవు సరసమేప్పుచుండవలసిన వాఁడవు కదా! కుక్కవలె వాకిటిలో మొఱుఁగుచున్నావేమి?

సుబ్బి—పెద్దమనుష్యుఁడవు. నేప్పుకొనిపోయినావు. నీకు వచ్చినయేండ్లెవనికి వచ్చినవి. నీపేరుగల చీటినుక్కపంపి సాటు పంపితి. నీ బొంకి యాయమసామ్మునకు గసీదు తెప్పొంచునా? ఇదిగో నీచీటి.

కృష్ణ—అయ్యయ్యో! ఇదియా చీటియే! డబ్బులతో బాటిది వెట్టిమండకొడుకు చేతిలో బెట్టితిని. తిరుగ జేబులో వేసికొనక దానితో నతఁడేమి చేసికొనునని యాతనిచేతిలో బడవైచితిని. అతను లోపలఁ దూఱినాఁడా యేమి?

సుబ్బి—ఆ—నన్ను వాకిటిలోనికి గెంటి---

కృష్ణ—ఇప్పుడు పిచ్చివాఁడు, సానియు లోపలనున్నారా?

సుబ్బి—ఊఁ.

కృష్ణ—ఓరి నిర్భాగ్యుఁడా! ఎంతపని సేసితివిరా! పిచ్చివాఁడు సుందరిని గొంచె మెఱుఁగును. దానినేమియుఁ జేయఁడనుకొందును. చేయునుగాక! కుక్కముట్టుకొనిపోయిన భక్ష్యము నాకేల? అయినను మాటవరుస కడుగుచున్నాను. నీవు సానిదాని నేమియుఁ జేయలేదుకద!

సుబ్బి—కాలిమీఁదఁ జేయివైచినయెడల గాయత్రీతోడు. కన్యకాపరమేశ్వరి పాదాలతోడు. అరువదిపరాల బనారసుకోక యిప్పుడువిడచి ముదుకగుడ్డ కట్టుకొని గళ్ళదుప్పటి ముసుఁగువైచుకొని వచ్చినదో యిప్పుడే నాకసహ్యత గలిగినది.

కృష్ణ—ఆ! ఆ! అది బనారసుచీరతోడనే పోయినది. దానికి

గళ్ళునువ్వటిలేదు. నీసాహేబు సాయంకాలమైన తరువాత నీయింటికి వచ్చినాఁడా?

సుబ్బి—ఈయుదయమే యతనిని గ్రామాంతర మంపితిని. ఎల్లుండికిఁగాని రాఁడు.

కృష్ణ—ఏకోమోసము జరిగినది. నిన్ను నమ్మవలసిన పని కూడ లేదు. నీవును దొంగలజట్టులోని వాఁడవని నా నమ్మకము. నా సాని యొడలిపై నాలుగువేలరూపాయల నగలున్నవి. వానిలో రెండు వేలరూపాయల యాభరణములు నేనిచ్చినవే. వానిని నేను దిరుగఁ దీసికొందును. నాసాని నాకుఁ గనఁబడువఱకు నీకంఠాభరణము నా చేతి కిమ్ము. మాఱుగా నుంచెదను.

సుబ్బి—ఒసీదిచ్చినయెడల నేదియైన నిచ్చెదను.

కృష్ణ—ఛీ ! మాటలాడకుము ! సాని కనఁబడినతరువాత నీవస్తువు నీకిచ్చెదను (తీసికొని) ఇదిగో! ఈయింటితలుపులు పగులఁగొట్టి లోనఁ బ్రవేశింపవలసియున్నది రా!

సుబ్బి—అక్కటా లేరు. ఓఅత్తయ్యో! ఓమామయ్యో! ఇంత దబ్బుఁ దిని యెవరును మాటలాడరేమల్లో! ఓరయ్యల్లో ! (అని కేకలు వేయును.)

కృష్ణ—అచ్చటినుండి పిలిచిన వినఁబడునేమోరా ! (ఇద్దఱు నిష్క్రమింతురు.)

రామ—మేము కోటలోఁ బ్రవేశించునప్పటికి మూఁడుఫిరంగులు వేయఁబడుచున్నది. ధామ్; రెండవదానికిఁదిరుగ మందు దట్టింపవలయును (చిలుముగొట్టములో గుడ్డపెట్టి నొక్కును.)

సుబ్బ—(లేచి) అమ్మయ్యో ! ఆచప్పుడేమి ! అయ్యయ్యో ! వెఱ్ఱిముండకొడుకు తిరుగ నిక్కడకు వచ్చినాఁడు. ఎవనిని దప్పించుకొని నేనిక్కడకు వచ్చితినో వాఁడే యిక్కడఁ బ్రత్యక్షమైనాఁడు. (క. ఇ

నన్ను వీఁడు వదలునని తోఁచదు. కోమటియాతఁడేఁడీ ! అయ్యయ్యో ! ఇది నాకు స్వప్నము కాదుగద !

రామ—పండితరాజేంద్రునకు ధామ్; తిరిగి ముందు కూరవలయును. (చిలుముగొట్టములోఁ గుడ్డఁ గ్రుక్కును.)

సుబ్బ—ఇఁక మానప్రాణములు దక్కవు. పాతిపోవుటకు లేచినమొదలుఁ బట్టుకొనును. హా ! భగవానుఁడా ! ఈచిక్కునుండి విముక్తిసాధనమేదైనఁ దోఁపింపవా ?

రామ—వెఱ్ఱిముండకొడుకునకు ధామ్; ఇఁక సంతే.

సుబ్బ—ఈతనివలెనే వెఱ్ఱితనమును నటించి యేదో యల్లరిచేసినఁగాని నన్నితఁడు విడుచునట్లు తోఁచదు. ఎట్లో మర్యాద దక్కించుకొని బ్రతికి బయటఁబడవలయును. ఈతఁడు ముద్దులాగున నున్నాఁడు. ఏమో! యెట్లీతనితోఁ దంటాలు పడవలసివచ్చునో ధైర్యమువలంబింపవలయును మొండితనమును బూనవలయును. మానప్రాణసంరక్షణార్థమయి యేమిచేసినను దప్పేమున్నది? అయినను నన్నిక్కడఁ జూచువారెవరున్నారు : ఇతఁడు పిచ్చివాఁడే కదా! వీధిలోనికిఁ బోయి కోమటిని మోసపుచ్చి యీతఁడు లోనఁ బ్రవేశించినాఁడు కాఁబోలు ! కానీ ! ఈదుప్పటియేల ? తీసిపైచి కూరుచుండెదను. అయ్యయ్యో ! తీర పిచ్చి నభినయింపఁగలనో లేదో ! ఈకర్మమెప్పుడైన నెఱుఁగుదునా యేద్తునా ?

రామ—ఓహో! వహ్వా ! సెబాస్! బళీ : ఏమిది ! యేమిది ! ఓహో! సజీవసాలగ్రామము ! కూర్మమూర్తి ! వహ్వా ! పార్థివలింగము మాశారదాపీఠములో నవతరించినది ! ఈమె మగళిసూత్రవిచ్ఛిత్తి కాలమందే మాయజ్ఞోపవీత విసర్జనమైనట్లు కనఁబడుచున్నది. ఎటులైన నేమి ? శుద్ధబ్రహ్మచారిణీతత్వము. ఇఁకఁ బూర్వపుణ్యప్రభావముచేత నది రామశాస్త్రికి గృహిణి కావలసియున్నది.

ఇట్టి దుశ్చటికట్టుట—ఇట్టి పెండ్లిమంత్రములు చదువుట—ఇట్టి సూత్రధారణము చేయుట — అంతే-అష్టమహిషీకల్యాణము. తాళ్ళ పాక చిన్నన్నగారిదటు—అనాథమహిషీకల్యాణము తర్కశిరోమణిరా మన్నగారిదిటు. వహా వ్వా ' పెండ్లికొడుకు వచ్చుచున్నాడు ! ఓహో హో : ఓహోహో ! ఓహో ! ఓహోహో ! ఓహోహో ! ఓహో ! (సవారిమూలుగు) కలికిబొంగు కందిటికి దగులుచున్నది దింపు బ్రహ్మరథముదింపు ! పెట్టు ! పెట్టిముండకొడుకా ! కుడికాలు ముందునకుఁబెట్టు ! హరిః ఓమ్ "శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణమ్ చతుర్భుజం ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే" మంత్రాలు మాని జేసి—ఆమశ్రాద్ధము చేయించినట్లు చేయింతును. అందులో సత్తిగారి శ్రాద్ధము కోడలుపెట్టినట్టుగాని కర్చుకాకుండఁ జే యింతును. పూర్వసౌభాగ్యవతి ! అచమనము చేయుము ! వ్యాసంక రాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం, ఆవ్యాసుఁడు వితంతువ్రికి యలో మాత్రము వీరపురుషావతారము ! పిభర్త పేరేది ? ఇదే గట్టి చిక్కైన ఘట్టము ! ఉన్నయెడల వితంతువ్యక్తి కసంగతత్వాక్షేపము వచ్చును. శశవిషాణన్యాయముచేత- లేనియెడల వివాహమునకుఁ బ్ర సక్తియే లేదు. ఉన్నదా లేదాయను మీమాంసలోనే కదా సాంఖ్యు లకు యోగులకు జుట్టుజుట్టు పట్టువలకు వచ్చినది ?

సుబ్బ—ఇప్పుడు మనకు నంతే! జాగ్రత్తగానుండుము.

రామ—నీకు జుట్టేది? హెహెహె! (నవ్వును)

సుబ్బ—నిమతియున్న స్థలమునను్నది. పోయిపాదకి తెచ్చుకొ నుము ! పో ! మాటలాడకు ! దూరగముగఁబో !

రామ—పనిలోఁబని నీజుట్టుకూడ దీసికొనిరమ్మందువా ? నవ రాలు సౌభాగ్యవతులకు శైలూషులకే చెప్పినాఁడు గాని యతులకు వితంతులకు మనుస్మృతిలోఁ జెప్పియుండలేదు. ప్రత్యక్షప్రాయశ్చిత్త

మేకాని పనికిరాదన్నచో బ్రహ్మతరమగునా! ప్రత్యామ్నాయ ప్రాయశ్చిత్త ముండితీఱవలెను.

సుబ్బ.—నిజమే! ఎల్లకాలము మామిడికాయలు తినవలయున నిన నీశ్వరుని తరమగునా? మాగాయ, మెంతికాయ, తోడమెంతి కాయ, ఆవకాయ, బెల్లపుటావకాయ దప్పళపుటూరగాయ యుం డితీఱవలయును. ఏది! తాండ్రకాక—

రామ—సెబాస్! నీవుకొంత శాస్త్రప్రవేశమున్నదానివలెఁ గనంబడుచున్నావు! మనము ముఖాముఖిని కూరుచుండి త్వంశుంఠ త్వం శుంఠి యనుకొనకుండఁ బనాముగఁ బూర్వపక్షసిద్ధాంతాలను వదిం చుచుఁ గ్రమముగాఁ జేయుచేయిఁ గలుపుకొన రప్పాంతసేపు శాస్త్రప్ర సంగముఁ గాలక్షేపము చేయుదమా? మధ్యస్థుఁడు లేనివాదము, పు రోహితుఁడు లేని పెండ్లివలె నసమంజసము గావున నదిగో! మధ్యస్థపీఠ మునఁ జెలువముగొల్ప నుంచుచున్నాను. ఇదిగో! నేను జుట్టుముడివైచు కొని, నడుముకట్టుకొని, యుపదేశముద్ర కట్టుకొని సిద్ధముగానున్నా ను. ఇఁక నీవు మాత్రము బెసకనియకుండ పైచుకొని యడ్డుకట్టు గట్టిగా బిగించుకొని బ్రహ్మాసనమునఁ గూరుచుండి కళకళఁ బూర్వపక్ష మెత్తుదువో సిద్ధాంతమెత్తుదువో కాని! లేనియెడల నేను సిద్ధముగాను న్నాను. ముముక్షుపురుషుఁ సాధనద్వయమున్నదని చెప్పినారుగదా— వానిలో నంతరంగసాధనమేది? బహిరంగసాధనమేది? దాని క్రమమే లాగు? దీనిక్రమమేలాగు? దీనికి దానికున్న భేదమేది?

సుబ్బ—పనసకాయకూర రెండుమార్గములుగా వండవచ్చును. పులుసుపెట్టి వండుట యొకటి—పెసరపప్పువేసి వండుటయొకటి. పు లుసుపెట్టినదాని కావఁదగిలించినయెడలఁ దమాషాగానుండును. పప్పు వేసినదానిలో గట్టి పడియములు వేసినయెడలఁ బసందుగానుండును. దానియందుఁ గారగుణము హెచ్చు. దీనియందుఁ దక్కువ. సంతర్ప

రామ—నీలెక్క సరిగానే యున్నదిగాని నీకు శాస్త్రజ్ఞానమున్నట్లు మాత్రము కనఁబడదు. అయినను "సత్యేవాహంజాతు వాసం" అనుశ్లోకములో ద్వైతముగా కనఁబడుచున్నదిగదా-త్వమేవాహం" అను దానిలో నద్వైతము స్పష్టముగానున్నదిగదా-ద్వైతాద్వైతమతసంబంధసాంకర్యసన్నివేశమునకు హేతుభూతత్వమైన కారణమేమి?

సుబ్బ—ద్వైతులు నిలువుబొట్టువారు; అద్వైతు లడ్డుబొట్టువారు. ద్వైతులలో మగవారు తఱచుగాఁజుట్టకాల్తురు అద్వైతులలోఁ దఱచుగాఁబొంకుముపీల్తురు. వారిలో నాటువారు కచ్చపోసిబట్టకట్టుకొందురు! వీరిలో సద్దుకట్టాచారము. వారిలో వితంతువులు రాత్రియందుకులేకాని తినరు. వీరిలోమినుపరొట్టె మొదలైనవి తిందురు. వారు పచ్చడులు చేయుటలో సమర్థులు. వీరుకూరలలోగట్టివారు. వారి కేకాదశీనియమము, వీరికి శివరాత్రినియమము.

రామ—చూడు! నిన్న వెట్టియాసుపత్రిలోఁ జూచినట్లు జ్ఞప్తి యున్నది. అయినను శాస్త్రప్రసంగముగట్టిపెట్టి సముచితముగ లౌకికవ్యాపారప్రశంస కావలెఁ జేయవలయును. ఇంతదూరమునుండి నీకు నాకు నెగుడుదిగుడుగా నున్నదిగాన దగ్గఱకువచ్చి—మఱి—దగ్గఱకువచ్చి దగ్గఱఁ గూరుచుండును)

సుబ్బ—ఉండు. దూరముగానుండు. (వెనుకకుఁబోవును)

రామ—వ్యవహారసత్యత్వ మంగీకరించినప్పుడు సందేహామెంతమాత్రము నుండఁగూడదు. శుక్తిరజతభ్రాంతిలో దూరముగా నున్నంతసేపే రజతత్వము గాని దగ్గఱగాఁ బోయిన తరువాత=(దగ్గఱకుఁ బోవును) శుక్తిత్వము నిలిచెనందువా లేదా? ఇంకను దగ్గఱగాఁబోయి మఱియింకను దగ్గఱగాఁ బోవునప్పుడు=ఆశుక్తిత్వమును బోయి బ్రహ్మత్వమగునా కాదా? మతగురువులందఱు సన్యాసులేకదా? వహావ్వా

